# కృష్ణ మహాభారతము.

ఇది

పురసంస్థానవిద్వత్కవీశ్వరులును

వధానులు నగు శ్రీవేంకట

మ కృష్ణ కవులచే

రచియింపఁబడినది.

మొదటికూర్పు 750.

జ్జనమనోరంజనీముద్రాక్షరశాల,

పిఠాపురము.

1916.

వెల రు 0—12—0



వేంకట రామకృష్ణ కవులు, పిఠాపురం.

# పస్పశము.

"ఈశ్వరవేఱు" కారణాభాసమువలన రామకృష్ణులకును తిరుపతివేంకటేశ్వరులకును గలహము పొడమి యైదేండ్లు కావచ్చినది. ఇక్కవులవివాదముం జేసి లోకమున కెంతయుపయోగము గలిగినదియు నెంతయనర్థము వాటిల్లినదియు నిర్ణయించుటకు సహృదయులే ప్రమాణము. మే మావిషయమును వివరించుటయందు మాత్రము మూకులము. వేంకటశాస్త్రిగారు చెప్పుచున్నట్లు "వివాదగ్రంథములవలన నరంటితోఁటవలననుబలె నుభయకర్తృలకును విశేషద్రవ్యము గూడుచున్నది. కావున నితరగ్రంథముల రచించుటకంటె నిదియే లాభకర" మని చెప్పుటకు మేము సాహసింపము. అది సత్కావ్యములం జేసి ప్రపంచమును మెచ్చింపఁజాలనివార లాడుమాట. మావీనుల కింపుసంపాదించినది కాదు. కాని, యాశాంతుని వాక్యధోరణిచేఁ గలహమునకు డిగునాఁటి కాయనకుఁ గలహృదయము మాఱి యన్యథాపరిణమించిన దనుకొనియెదము. లోక మెట్లు తలంచునో? ఎవరిపక్షమును వారు న్యాయ్య మందురు. కావున నేకపక్షోక్తులవలన నన్యపక్షమునకు నింద యేర్పడును. అట్టిదూఱును బాపుకొనుటకు వారు తమవాదమును సమగ్రముగా వెల్లడిపఱుపక తీఱదు. కావుననే రామకృష్ణకవులు ప్రతిఘటింపవలసివచ్చినది. "ఊరకుండువారి కూరెల్ల నోపద" యనునార్యోక్తి యిట్టిపట్టుల నన్వయింపఁ దగినది కాదు. మధ్యవర్తి యుభయవాదములను వినినపిదపఁ దత్త్వమును నిర్ధారించుకొనును. ఆచింత మనకు వలదు. ఇఁక నెంత కాల మిట్లు వివదించుట? దోషోద్ఘాటనము ముగిసినది. ఈపై వ్రాసిన

దానినే వ్రాయవలయును. వ్రాసినదానినే మఱియు వ్రాయవలయును. భావ మొక్కటియే. ఫలితమును సమానమే. అట్లయిన నెవరోయొక రివాదమును ముగింపఁజెల్లదా? ఎవరు ముగింతురు? వారావీరా? ఎవరు ముందుమానిన వారికే మానహాని యనుతలఁపుగాదా? ఔను నిజమే. ఇందుల కొకయుపాయము గలదు. వృద్ధులకు మనశ్శాంతి యనదు. తిరుపతివేంకటకవు లిందుల కుదాహరణము. అట్లయిన రామకృష్ణకవు లీకఁ గలహకావ్యములు వ్రాయరు. ప్రారంభించినభారతము పూర్తి యయినదా? లేదు. కొన్నిపర్వము లయినవి. అంతియ చాలును. మిగిలిపోయిన మఱికొన్నివిషయము లీపస్పశములోఁ బ్రస్తావింపఁబడును.

గీరతనామము సాధువా? కాదు. “భారతము గీరతము” అని నిందయందామ్రేడితము నాద్యక్షరముగ “భా, కు గీ” యగును. కావున, భారతమును వెక్కిరించు పేరు పెట్టినచో నిం దేమివిశేషముండునో యని పలువు రాచెత్తపొత్తము నాకాంక్షింతు రనుతలంపుతో దాని కాయపనామమును గవులు పెట్టియుందురు. కాని యది వైయాకరణఖసూచిత్వము నాపాదించుచున్నది. పూర్వరూపసాహచర్యము లేకుండ, నిందయందలియామ్రేడితముతోఁ గూడినయామ్రేడితమునకుఁ బ్రయోగ ముండదు. ఉన్న నేమిదోషము? అనిశ్చయప్రసంగము రాదా? “గీముఁడు” అనునిందారూపము రామభీమకామసోములలో నెవన్నికైనం గావచ్చును. అట్లే గోరతమునకును హీరతమునకును గూడ నిందయందు గీరతము గావచ్చును. ఈవిషయము నెల్ల రామకృష్ణులు నిర్వచింపఁగా వినియే తిరుపతివేంకటకవు లన్యార్థము చెప్పి దానిసాధింపం జూచిరి. ఇది యిట్లూహించుట యెట్లు? వారిపుడు చెప్పినయర్థమే ప్రథమోద్దిష్టము కాఁగూడదా? మంచిప్రశ్నము !

“ గీరతులు=వాక్కులయం దాసక్తు; లనఁగాఁ బండితులు. వారినుద్దేశించి చేసినది గీరతము ” ఇదియే కదా వారివ్యుత్పత్తి? దోషజ్ఞాది పదములకువలె గీరతశబ్దమున కేనిఘంటులయందైనను బండిత పర్యాయములలోఁ బ్రవేశము గలదా? అప్రయుక్తదోషము లేదా? వీరిప్రథమోద్దిష్టార్థ మిదియే యైనచోఁ బండితాదిప్రసిద్ధపదముల నొకదానిని గైకొనక యీస్వకపోలకల్పితగీరతపదమును బట్టుకొని యేల ప్రాఁకులాడుదురు? ఇంచుక యరయఁగలిగినచో మందమతికి సైత మీవిషయము దోఁపక మానదు. అగుఁగాక! గీరతులనధికరించి చేసినది గీరత మెట్లగును? ఛప్రత్యయము వలదా? ఉపచారమా? ఎట్లయిన నేమి? వ్యాకరణాపచారము దప్పినది కాదు. అటయిన నాంధ్రవ్యాకృతిచ్యుతి. ఇటయిన సంస్కృతవ్యాకృతచ్యుతము.

కాకరపర్తిలో వేంకటశాస్త్రిగారికి శృంగభంగ మయినతరువాత నాతనికిఁ మతిచలించిన దని కొందఱు రామకృష్ణులతోఁ జెప్పుచువచ్చిరి. వా రాపలుకులను బాటిచేసినవారుకారు. ఆవిషయము నీక్రిందిజాబు విశదీకరింపఁగలదు.

---

పిఠాపురము.

13 జూలై 11.

డియర్ సార్

ఇందుతో మీరు కోరినప్రకారం శృంగభంగం 2 కాపీలు పంపినాను. 12 వచ్చినవి గాని నాదగ్గర యిప్పుడు మూడేవుండగా అందులో రెండు మీకు పంపినాను. నే॥ శంక......న్ని యింకా బుక్కులడిగినాను గాని యిచ్చినాడు గాడు.

వెం॥ శా॥ గార్కి మతిపోయినమాట నిజమే. నే॥ గ॥గారు నిన్న వచ్చి చెప్పినారు. నిమ్మపళ్ళపులుసువగైరా మర్దనాలవల్లనున్నూ డాక్టరుసువైద్యంవల్లనున్నూ యిప్పుడు కొంచం నింపాదిగా నున్నట్లు ది. తి. శా. గారికి మొన్నటిరోజున వుత్తరం వచ్చినదంట. విశేషములు మనం కలుసుకొన్నప్పుడు మాట్లావడచ్చును. చించినాడ వెంకటర......పేర వుత్తరం వ్రాసి కనుక్కుంటే బాగా వుంటుంది.

ఆ॥ శా॥

---

ఇట్లుండ రామకృష్ణులు వేంకటశాస్త్రిగారికి వెఱ్ఱియెత్తినదని గోలచేసిరని గీరతము నుడువుట తనయపనామము నన్వర్థము చేసికొనుటకే కదా?

వెం॥ శా॥ గారు తమయూ రగువింజరమున కేగునప్పటి చర్యలను దెలుపువుత్తరము పాలంకి సుబ్బావధానులుగారు వ్రాసినది.

శ్రీ్రకర్త.........వ్రాయున దేమన...యీమధ్య అనగా మాసమ్ము పూర్వము.....ప్రతిపక్షాగ్రగణ్యు లయ్యిచెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిగ్రామమ్ము వచ్చి 5 రోజులు క్రమముగ మీటింగులు జరిగించిరి. మొదటిరోజ్ను సదరువెంకటశాస్త్రిగారు దేవస్థానములో మీటింగుచేయుదు రనేసంగతి నాకు తెలియకపోవుటచే నేనాయ్న స్వామిసన్నిధి కొచ్చువరకు......యుంటిని. అపుడు వారు ...త మందితోవచ్చి మేమునిర్దోషులమనిన్ని నిర్దోషులమైనమాయందు

దోషారోపణచేసిన వేంకటరామకృష్ణులయొక్క చరిత ...సభవారం దరు విని మాలో యీదోషములు ఎవరియం దున్నవో విమర్శించ గలందులకు కోరుచున్నాడను అని వారు చెప్పినగీరతమ్ముక మొద టిపద్యము నుడివిరి. పిమ్మట కేవలము న్న రామకృష్ణశాస్త్రిని నిందించు రెండవపద్యమును పఠించెను. ఆపద్యము వినుటతోడనే గ్రంథమంతయు యిదేరీతిగా నుండవచ్చును అని తలచి యీయ్నతో విగ్రహించినయడల...పద్యరూపముగా దూషించినట్లు నన్నుగూడ నిందించెదరుగ్నా...మనము గలహించుట యుక్తముగాదని నేను వెంటనే అచ్చటినుండి వెడలి యింటికి వచ్చితిని...ఆమలుచటిదిన మం దాయ్న మ్నయింటికి నాకొరకొచ్చిరి. వచ్చి......నిన్నటిరో జ్న నేను వినుపించుగ్రంథము వినక వెళ్ళినకారణ మేమి యని నన్ను గట్టిగా అడిగిరి......నిందింపుచుండ వినుటకు యిష్టము లేక వెళ్ళితినని జవాబు చెప్పితిని. ఆగ్రంథమందు చక్కనినీతిగాని నింద లేదని నన్ను నప్పించిరి. మీరు చదివిన రెండవపద్యములో నంతయు నీతియేనా అని అడిగితిని. అదిగాక యంతయు నీతియని చెప్పిరి. యీరోజ్న వచ్చి......విన్నయడల కేవలానందపర మేగాని కోపరసము గల్గదు. ఆలా కోపరసమే గల్గినయడల......నన్ను యేమన్నను సహింతునని నాతో ఖరారుచేసి నన్ను దేవాలయమ్ముకు తోడ్కొనిపోయిరి. ఆరోజ్న నేను విన్నదంతయు కేవలము మిమ్ములను దూషణగాని మరియొకటి గాదు. అట్టిసమయంబున నాకు మనస్సునకు చాలాభార ముగా నుండి మీరుకోకిలకాకములో ఒక్కొక్కపద్యమునకు 20 పద్యములు చెప్పినామని నుడివితిరిగదా ఆకోకిలకాకము నేను దగ్గర నుంచుకొని వారు చెప్పినకోకిలకాకము సభవారికి వినిపింపుచు పిమ్మట మీపద్యములను వినినయడల......అప్పుడాయ్న ఆత్మస్తుతి

అమితముగా చేసుకొనెను. ఆసమయంబున యిచ్చట నేనొక్కడను గాక మిగిలినవారందరు ఆయనపక్షమునే అవలంబించి సంతసించిరి. వేమల వేంకటరామయ్యగారికుమారుడు సూర్యనారాయణమూర్తి యిచ్చట పాఠశాలలో బాలురకు బాలరామాయణాదిగ్రంథములు పాఠములు చెప్పుచు ఉపాధ్యాయులుగా నుండెను. యితను వేంకటశాస్త్రిగారిభావమరదికి అల్లుడగుటచే వేంకటశాస్త్రిగారిపక్ష మవలంబించి యిప్పట్కి నచ్చటచ్చట మిమ్ములను నిందించుచుండెను. గ్నా యేవిధమయ్నిపాండిత్యము లేనివారు మిమ్ములను నిందించుచుండుటచే వీరలకు బుద్ధివచ్చేటట్టు కొన్నిపద్యములను వ్రాసి పంపించినయడల యీపత్రిభృతులకు నేను బుద్ధి చెప్పగలను......యీవేంకటశాస్త్రీగారు గీరతములో కేవలము రామకృష్ణశాస్త్రిని బాగా నిందించెను.

ఆషాఢ బ ౫ ఆదివారము.



వింజరమునుండి వచ్చినమఱియొక జాబు.

ది 11—3—15.

యింజరంపాఠశాల

రామకృష్ణకవిశేఖరులారా!

మామాట విని వెంకటశాస్త్రిగారిని ఏమూలనైనను గురువుగా వ్రాసినచో మేమందరము చాలా సంతోషించుతాము. లేకపోయిన

ఆయనకు మతిపోయేలాగున యున్నది. తిరపతిశాస్త్రుర్లుగా రంతగా క్షోభపడుచున్నట్టుగా తోచుటలేదు. పాపమాయనకు......గోడవె గాని మరియొకటి యక్కరలేదు. పాపం వెంకటశాస్త్రిగా రొక్కరే నానాక్షోభపడుచున్నారు. పుట్టినబుద్ధి......తో గాని పోదనుసామె తగా ఈయనకు తమ రెన్నిచెప్పినను మతి కుదురునట్లు లేదు. కాబట్టి గురువుగా చెప్పిన చాలా బాగుండును. వెంకటశాస్త్రిగారియ వస్థ చూడగా మతిపోవుటకు ప్రథమావస్థగా నున్నది. మేము పదిమంది కలసుకొని తమపేర వ్రాసుకున్నాము. మాకార్యమన్నించవలెను. అచ్చుకొరకు బోలెడుఖర్చగుచున్నది. సంతానంకూడా కలిగింది. మామనవి మన్నించి ఆయనకష్టము గట్టు కెక్కింపుడు. ఆయన ఒకడూ రావలసివచ్చింది. పాపం, తిరుపతిశాస్త్రిగారుకూడా బందరు వెళ్ళి సాయంచేస్తే బాగుండును. విగ్రహారాధనము కుమారకాయను విచారముతో వ్రాసినారు. కుమారకా యనివ్రాయుటచే మాకుకూ డా యిబ్బందిగా నున్నది. విగ్రహారాధనము చూడగా ఆయనకష్ట మింతింతనరానిదిగా నున్నది. వారిశిష్యులు......వారిపక్షమే న్యాయ మని ప్రతియింటికి వచ్చి పుస్తకము చదువుచున్నారు. వెంకటశాస్త్రి గారు చెప్పినపద్యం ఆనందభైరవిరాగంమీద ఆయన చదువుతే ఆయననుచూచి విచారించనివా రుండరు. మొత్తంమీద వెంకటశా స్త్రిగారికి మునుపటిబింకం తగ్గింది. శ్రీరామమూర్తిగారివద్ద తిన్న... ......చేత ఇంతమట్టుకు బింకంఉంది కాని లేకపోతే అది వుండదని ఈవూరువిద్యార్థు లన్నారు. ఆయనపేరవుత్తరంవ్రాయుటకు భయము గా వున్నది ప్రతీది అచ్చువేసుకుంటాడు. మిమ్ము మీగ్రంథము లెరుగక మునుపు వారిదే న్యాయమనుకొనేవారము గాని మీపుస్తక ములు చూడడంతోనే సంగతులన్నీ తెలిసినవి. యిది అచ్చువేయించ

వలెను. ఇది రహస్యం గాదు. యథార్థం గాని. మావిద్యార్థుల మండలము ఎరుగుదుము ... ... ...

ఇట్లు విద్యార్థులు
వింజరం.

---

......నోటికివచ్చినట్లెల్ల వ్రాయుచు మీరు త్వరగా భారతం వ్రాయుటం లేదనిఆక్షేపణ జేయుచున్నారు. త్వరగా అచ్చువేయవలసి యున్నది.

తిరుపతివేంకటకవులు వారినివారిని బతిమాలియు మోమోటపెట్టియుఁ బురికొల్పి లేనిపోనియుత్తరములు వ్రాయించికొని ప్రకటించుకొనుచున్నట్లీయుత్తరము సాక్ష్యమిచ్చుచున్నది.

కవీంద్రులారా!

శివరామునినుడులు బహుచిత్రములుగా నున్నవి. మీఅట్టహాసంబున వ్రాసినతాలుకుట్టనంబులో కొన్నిసంగతులు వొప్పుకున్నట్లు వ్రాసిరి. కొన్నిటికి చేతగానిసమాధానములు వ్రాసినారు. పద్యములు యెంతపాడుగానైనా యున్నాయి. దీనికి మీరు సమాధానం వ్రాయవద్దు. కు.........ప్పదెబ్బ అనునట్లుగా ఊరుకొనుటే యుక్తము. శివరాముడుగారు తాలుకుట్టనం వ్రాయకపోతే గొప్పవారని అనుకొందుముగాని వారిఅసహనం వెల్లడిచేసి యీగ్రంథం వ్రాయుటచే ఆయన తెలివితేటలు వెల్లడిఅయినాయి. ఈశివరాముడుగారు వెంకటశాస్త్రిగారిశిష్యు లనగా ఎందులో అనుకొన్నారో మీరు. కవిత్వంలో గాదు సాహిత్యంలో గాదు. వే...మర్మములలోనున్నా పొడుంపీల్చడంలోనున్నా•గురువుగారు. అంతమాత్రం గురువుగారు కనుక

ఆయనకష్టపడుచున్నారని సాయంచేస్తూన్నారు. ఈయనశృంగారపురుషుడు. అవధానంకూడా పాతికి మందికి నిరాఘాటంగా చేస్తాడు. తాలుకుట్టనంపేరు ఆగ్రంధానికి తగియే యున్నది. వినుటకు చాలా అసహ్యాముగా నున్నది. ఎంతపాడుగ్రంధమైనను పేరు మంచిదిపెట్టుట యుత్తమముగదా తాలుకుట్టనంపై సమాధానము వ్రాయవద్దని మాప్రార్థన. ఇదియొక పాడుఉత్తరం అనుకోవద్దు. మాఅభిప్రాయమే గాదు లోకంలో అందరిఅభిప్రాయమిట్లే యున్నది. అందరూ అనుకొనిమాటల్ని పట్టి వ్రాసినాను. గీరతం నేతిబీరకాయ, అబద్ధములకు పుట్టిల్లుఅనునది లోకవిదితమే. ఏనాంవచ్చి అక్కడజనులు అనుకునే మాటల్ని పట్టి వ్రాసినాను. మీరామకృష్ణశాస్త్రిగారివద్ద యెవరు నిలువలేనే కొందరును, కేవలం క్ష్మేస్తకవి.గారు వెంకటశాస్త్రిగారిని జయించుటకు పుట్టినారని అనుకుంటూన్నారు. కృష్ణశాస్త్రిగారికిని మీకును అనేకనమస్కారములు. మీభారతం లోకమునకు నీతిబోధకముగా నున్నది.

చిత్తగింపుడు.

వెంకటశాస్త్రిగారిగీరతములో గల నేవ్రాసినఉత్తరం తిరుపతిశాస్త్రిగారిపోరు పడలేక వ్రాసినాను. క్షమించవలెను పొరబాటు యదార్థము.

తులసి విశ్వనాథంవ్రాలు.

---

కాకరపర్తిలోజరిగినశృంగభంగము కల్లయనిపించుకొనుతలంపుతో నాయూరంగలయిద్దఱుముగ్గురుపండితుల నర్థించి వ్రాయించుకొనినయుత్తరములు తమకుపయుక్తములు గాకున్నను గీరతములో

గూర్చుకోఁబడినవి. ఆపండితులే మాకువ్రాసిన యీక్రిందిజాబులలో నిసారస్యమరయుఁడు—

బ్రహ్మశ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రిగారు సంస్థానకవి, పిఠాపురం. తుని...క్షేమము 14-8-11...............ఉత్తరము వచ్చినమాట సత్యముకాని ఆప్రకారం రాలేదు. విశేషము లయినను ఎంతమాత్రము లేవు...............ద్వివేది బ్రహ్మానందశాస్త్రి 17—8—11 తుని క్షేమము......మీారు వినినప్రకారం నేను ఉత్తరం వ్రాసియుండలేదు. విశేషములు లేవు......

ద్వివేది బ్రహ్మానందశాస్త్రి.

---

శ్రీవేదమూర్తులైన వేంకటరామశాస్త్రిగారికి- పురాణపండ గవరయ్య యాశీర్వచనపూర్వకంబుగ వ్రాయుసంగతి యేమనగా— మాకు జరిగినయుత్తరప్రత్యుత్తరము లన్యవిషయంబులు. వాదిప్రతివాదిసాక్ష్యస్యతమప్రయోజనహీనంబును ప్రత్యుతవాదిప్రతివాద్యన్యతరద్వేషజనకంబును నగుసాక్ష్యమిచ్చుటకు నామనం బూరీకరింపలేదు. ఇచ్చట కుశలము. అచ్చటిక్షేమసమాచారములు వ్రాయ గోరుచున్నాను.

గ్రహించవలెను.

కాకరపర్రు
15 8 11

పురాణపండ గవరయ్య.



శ్రీరామాయనమః.

క్షేమము.

శ్రీరస్తు చిరంజీవి యైనఓలేటి వేంకటరామశాస్త్రికి. ఆణివిళ్ల సీతారామశాస్త్రి కృతానేకాశీర్వచనపూర్వకముగా వ్రాయునదేమనగా! ఉభయకుశలోపరి—

నీవు వ్రాసినయుత్తర మంది యందలిసంగతులు తెలిసికొంటిని. శ్రీవేంకటశాస్త్రిగారికి గ్రామస్థులకు దినముఖదినాంతముల యందు జరిగినసంగతులు అన్నియు శ్రీరామకృష్ణశాస్త్రి మొదలైన వారివల్ల నిదివఱ్ఱు నీకును తెలిసియుండవచ్చును. వారిగ్రంథములో విషయము వారు నాకు వ్రాయను లేదు. నేనావిషయము తెలియదని వ్రాయను లేదు. గ్రామస్థులు విరచించినగ్రంథములు ముద్రింపబడి యిదివఱకె యంతట వ్యాపించియున్నవి. మీరు బుద్ధిశాలులు గానవిశేషించి వ్రాయలేదు. ఇక్కడ చిన్నపెద్దలందరు క్షేమముగానున్నారు. అచ్చటిక్షేమసమాచారములు తఱుచు వ్రాయించకోరదను. గ్రహించవలెను.

ఆ॥ సీ॥ శా॥ శ్రావణ బ ౧౦ స్థిరవారము.

—oo✲oo—

రామకృష్ణులకౌరవగౌరవమును తి॥ వేం॥ కవు లూరకె నిందింపఁజొచ్చిరి. దానిపైఁ బండితాభిప్రాయ మెట్లున్నదియు నీయుత్తరములవలనఁ దెలియవచ్చును.

మ. రా. రాజశ్రీ, రామకృష్ణకవుల సముఖమునకు—

అయ్యా ! ఈక్రింద సూచింపఁబడువిషయమును గూర్చిగాని యదియనుకూలింపనిచో నాంధ్రభాషావాఙ్మయములకు సంబంధించి

నమతియొకవిషయముంగూర్చిగాని తాము తెలుఁగున నొకవ్యాసము ను రచించి యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటించుటకై పంపవేఁడెదను. సాధారణముగా వ్యాసము పరిషత్పత్రికప్రమాణము గల(రాయల్ ఆక్టేవో)పదిపుటలలో నిమిడినఁ జాలును. వీలునుబట్టి యంతకంటె నెక్కువయైనను తక్కువయైనను గావచ్చును. వ్యాసము తామొకమాసములోఁ బంపఁగలిగినచోఁ గృతార్థుఁడ నయ్యెద. ప్రత్యుత్తరము వేచియుండెద.

ఇట్లు
విన్నవించువిధేయుఁడు
జ. రామయ్య.

---

విషయము.

---

ఏదైన నొకవిషయముంగూర్చి పద్యవ్యాసము.

ఆర్యవర్యులారా!

"కౌరవగౌరవము" అనుశీర్షికతో మీరు రంపినపద్యములు చేరినవి. చదివినాఁడను. చక్కఁగా నున్నవి. పరిషత్పత్రికలోఁ బ్రకటించుటకుఁ బంపిన ట్లూహించెద. వెలువడఁగలసంచికలో ముద్రింపఁబడును.

విధేయుఁడు
జ. రామయ్య.

కృష్ణపర్వములో 165 పద్యముకడ నీయుత్తరముఁ బఠించునది.

రాజమండ్రి.
3—7—12.

---

శ్రీవేదమూర్తు లైన రామకృష్ణకవిత ల్లజులకు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి నమస్కారములు. త॥ నన్ను మీరు మిమ్ము నేనును ఎఱింగినవార మైనను ఉత్తరప్రత్యుత్తరములు లేనివెలితి మిక్కిలిగా నున్నదియే. నాయందు మీరు సదభిప్రాయము గలవారును మంచి హృదయము గలవారునుగా నే నెఱుంగుదును. మీరు ననుబోంట్ల నించుక క్రిగంటఁ జూచుచుండఁగలందులకు నా ప్రార్థన.

అనేకకారణంబులంజేసి......నాటకమును బ్రస్తుతము విమర్శించుచున్నాఁడను. దానింగూర్చి మీయభిప్రాయ మెట్టిదో వినఁగోరిక...నావిమర్శము అసూయాగ్రస్తమని కొందఱు పలుకుచున్నట్లు వినుచున్నాను. నేను యథార్థకథనమే చేసితినని నానమ్మకము. “ ఆపరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్ ” నాయందుఁ బరిపూర్ణమైనదయ యుంచి దీనికి జవాబువ్రాయుటయు సమయము పడకనేని మీపత్రికలో నింతవ్రాయుటయు జరిగింతురుగాక యని విన్నవించువిధేయుఁడు శ్రీ॥ కృష్ణమూర్తిశాస్త్రి.

---

వెం॥ శా॥ గారు తమ మేనల్లుఁడు కాకరపర్తిలోఁ జదువుకొనుచుండుటచే వానినిప్రోత్సాహపఱిచి వానిచేఁ గొన్నితప్పటుత్తరములు వ్రాయించి ప్రచురించుకొనినారు. ఆవిషయ మీక్రిందిలేఖమునఁ దెలియసగు.

శ్రీవేదమూర్తు లైనబ్రహ్మశ్రీ వేదుల రామకృష్ణశాస్త్రిగురువుగారికి నిత్యం నమస్కృతు లొనరించి వ్రాయువిన్నపములు. ......చిన్ననాటనుండియు చదువుచెప్పుచునుండియు నాదగుమనం బెట్టిదియో గ్రహింపకపోతిరని యాశ్చర్య మొదవె. వారికి నేనే క్షమించుడని యుత్తరమే వ్రాయుచో......కిమరల. రిజిష్టరుత్తరము

గట్టనేల దానిని పత్రికాముఖమ్మున వెల్లడిచేయనేల......నాయిష్టదేవతసాక్షిగా నేను వ్రాయనే లేదు.

ఇట్లు విధేయుఁడు
చర్ల వేంకటాచలపతిశాస్త్రి.

---

బ్ర॥ శ్రీ॥ పురాణము సూర్యనారాయణతీర్థుల వారివలెనే యాయష్టావధానిబిరుదాంకితులకును మొదట రామకృష్ణులయందు మంచియభిప్రాయమే గలదు.

ఈలేఖఁజూడుఁడు—

6
15-1-11 అయ్యా! మీ రనుగ్రహపూర్వకముగా బంపినమీగ్రంథమాల వందనములతో నందికొంటిమి. తత్ప్రభృతి యింతపర్యంతమును నే నింటివద్ద నుండకయు నుండినపుడు శరీరస్వాస్థ్యము లేకయు కాలాతిపాతముగా జవాబువ్రాసికొన్నందుకు క్షమింపుడు. మాకార్యస్థానమునందలియీనాలుగుగ్రంథములును దయారు స్వీకరించుడు. ఇట్లే పత్త్రికాధిపతులమగు మనము పరస్పరస్నేహంబున వర్తిల్ల బ్రార్థితులు. మీసంచికలు మాకు 5 వఁటకే చేరినవి. కాని తక్కినవి చేరలేదు. సరిగాబంపుచు మావి సరిగా దెప్పించికొనుడు.

చిత్తగించవలెను.

జా॥ ప॥ శా॥

---

పిదప వేంకటశాస్త్రిగారీయనకుఁ దమగ్రంథము లిచ్చియు నింక ననేకవిధముల నాశ్రయించుటచే నీయనకు రామకృష్ణులపై

విపరీతబుద్ధి గలిగినది. గాలికిఁగదలులఘుహృదయములు గలయిట్టిమ హాత్ములచరిత్ర విచిత్రముగదా? ఈజాబుంజూడుఁడు.

శ్రీమదాంజనేయపరబ్రహ్మణేనమః.

ఆర్యవర్యులారా!

నాలుగుమాసములకిందట మాగ్రామమునకు జానపాటి పట్టాభి రామశాస్త్రి కొంతచందాధనముఁ వసూలుచేసికొనుటకై వచ్చి మాయింటనే బసచేసి...అంత మే మిరువురమును శయనించినతరువా త వారు తమవిషయమై ప్రస్తావన దీసికొనివచ్చి యేదోకొంతయసం బంధప్రలాపయుతప్రసంగము జేయుచుండగా విని సహింపజాలక నయ్యా! శ్రీవారు మనకడనున్నచో తామిచ్చెదుప్రశ్నల కేమిసమా ధాన మొసంగెదరో? శ్రీవారు లేనియెడ నూరక మనలోమనము సంతసించిన నేమిప్రయోజనము? పోనిండు మీరు తిరుపతివేంకటకవుల యందు గలపక్షపాతబుద్ధిచే కవితావిమర్శనమును అభినవసరస్వతిని బ్రచురింపజేయుచుంటిరి. చాలదాఇంక వేరే మాటలేలా అని నేను యథావిధి మాట్లాడినట్లే మాట్లాడితిని. అంతనిద్రించితిమి.......... నాటిరాత్రి వారొనర్చినయప్రస్తుతప్రసంగమునుగూర్చి నేను ఈసడిం చుకొంటినని నాయందసూయాభావులై పత్రిక నంపక పద్యములం బ్రచురింపక నుత్తరమునకు సమాధాన మిడక నూరకుండిరి అని కొందరుమిత్రులు దెల్పిరి. ఐనను « మానుషాశాగరీయసీ » అనున్యా యరీత్యానున్న పారావతః ఖలుశిలాకణమాత్రభోజీకామీభవత్యను దినంవదకోత్రిహేతుఃఅనున్యాయరీత్యానున్న వారియాశకు మేరలేక పోగా నుండవలసినఅమ్మకృకళలన్నియు గలవుకాన నీకృతఘ్నునిం గూర్చి విశేషించి తమలాటిమహామహులకు వ్రాయుట యంతయు నప్రస్తుతము ... ... ఆశాస్త్రిగారిపాండిత్యము విశ్వబ్రాహ్మణదూష

ణవిషయమునసే వృద్ధియగుచు నిశికన్యకను నవ్వుకీర్తితో ప్రకాశించు
రుగాత ...........చిత్తగింపుడు.

ఇట్లు విద్వద్విధేయుడు
అష్టావధాని గోపాలుని హనుమంతరాయశర్మ.
10—8—11

తి|| వేం|| కవులు రామకృష్ణులను నిందించియేయశముసంపా
దింపసమకట్టిరనుటకుఁబ్రబలసాక్ష్యము.

గుంటూరు 25—8—11. బ్రహ్మశ్రీ వేంకటరామకృష్ణకవి
శిఖామణులకు. సుహృదవతంసులారా! మీమిత్రులు కొప్పరపుసోద
రకవులు వ్రాసుకొనునవి. మే మిదివరకు చెన్నపురిలో జరిపి
నసభలగురించి శశిలేఖపత్రికలలో జదివి 17—1—11 తేదిపత్రికలో
శా|| అయ్యా! కొప్పరపుంగవీశ్వరులు మీయాస్యంబు మే మెప్పుడే
నొయ్యంజూడగ లేదు—అనుపద్యము మొదలుగా మరికొన్నిపద్య
ములు తిరుపతివెంకటకవులు ప్రకటించిరి. 19—8—11 తేదీన
నీగుంటూరున ఫస్టుకం పెనీహాలులో నవధానసభ జేసిరి. అప్పు డవ
ధాన మనుమాటయు నాశుకవిత్వ మనుమాటయు వారిసభ గానరా
కుండెను. కాని అప్పుడపుడు గీరతములోనిపద్యములు మిమ్ము నిందిం
చుచు వినుపించిరి. ఆవిషయమున సభ్యులుకొందరు కోపమును వహిం
చిరి గాని యదివారికి తెలియదు. పిదప ప్రసంగవశమున—మిమ్ము
—దూషించుట కూడదని మేము కఠినముగా ననుటచే మరుసటిదిన
మున మేము సభకురాకముందే—ఏదియో కొన్నికారణములు కల్ప
నచేసికొని మమ్ము సభలో దురుక్తులాడిరి—పిదప—నిందుతో
పంపించినపత్రికలబంపించితిమి—28—8—11 తారీఖున నీగుంటూ

రులో సభగూర్చుటకు దలంచుచున్నాము. ఈగుంటూరులో నుండినను వారిసభకిష్టపడినట్లు కనుపింపదు..

గీ. నిరపరాధుల మమ్మిట్లు నిందజేసి
రట్టె మిము నిరసించినారనుచుజనులు
తలచుచున్నారు వారి-మిత్రవరులార
కృత్యమెరుగుడి యిది యెరిగించినాము—

ఇట్లు భవద్ధితులు, కొప్పరపు సోదరకవులు, కొప్పరపు వెంకట సుబ్బారాయ వెంకటరమణులు. ప్లీడరు. ఏకా రామయ్యపంతులుగారి యిల్లు. గుంటూరు—



మహాజనులకు రామకృష్ణులయెడఁ గలతాత్పర్యమును దెలుపు మఱికొన్నియుత్తరములు.

శ్రీరామః ప్రసీదతు. సుదర్శినికార్యస్థానం. నరసాపురం. 13-10-13 బ్రహ్మశ్రీ శ్రీమద్వేంకటరామకృష్ణపండితకవివరులకు. కస్తూరి శివశంకరకృతనమస్కృతిపురస్కృతవిజ్ఞప్తిక. ఆర్యులారా! "సఖ్యంసాప్తపదీనః" మితిప్రమాణాత్ పత్రికాపఠనకారణమున మనము మిత్రులమే. నేను తిరుపతివెంకటకవులనుగూర్చి తఱుచు గౌరవపూర్వకముగా నాపత్రికలో వ్రాయుచుండుట చూచుచుందురు. మీప్రతిపక్షులను గౌరవించువాడ నగుట మీకు ప్రతిపక్షిగణములోనివాఁడ నని మీరు భావింపరని మీప్రాజ్ఞత్వమును నమ్మెదను. మీ రొక్కసంగతి యోచించిన బోధపడగలదు. మీరు వారినిగూర్చి యేమివ్రాయుచున్నను వారిమెత్తుచున్నానా? లేదు. ఎందువలన? మీరర్హులు. మీరు

కష్టించి వ్యాకృతిపవిత్రమైనయున్నతవిద్యనభ్యసించి సుధాపేశలఫక్కిగవిత్వముజెప్పపోవిడలు. మీభారము నేనేల మోయవలెను ? ప్రతిచిగిలింతచెట్టును చింతచెట్టుతో వియ్యమందబోవునపుడె పరిహసించుటకు మాదృశుల కనువగును. కావున నాగుణములను మీరు సూక్ష్మదృష్టితో గమనించి యలరుదురుగాత! వారిగ్రంథములను మీరువిమర్శింతు రనుకొనుదు. మాకు శ్రమయేల? కువిమర్శకపంథను మీరే వెడలరు. ఇంతియ.........ఆక్షేపించుట కంతరము కావలయునని నాతిక్క.........ప్రస్తుత మనుసరింతము. చాటుపద్యమణిమంజరిలో నీదిగువపద్య మన్వయింపకున్నది. మీయట్టిధీవిశాలురనుంచిగాని మాంబోట్లకు సందేహనివృత్తి కాదుగదా.........

---

శ్రీమతేరామానుజాయనమః.

బ్రహ్మశ్రీ వేదమూర్తులును నిరవద్యవిచిత్రశతావధానకార్యపారంగతులును సరసకవితావనితామతల్లీధవులును నసంకాశకలాపాండిత్యవిరాజితు లగు వేంకటరామకృష్ణకవీశ్వరులపాదపద్మములసమ్ముఖమునకు-తమవిధేయులగుశ్రీనివాసరంగాభిధానులు నమస్కారపూర్వకముగలిఖించినవిజ్ఞప్తిక. మేము గుంటూరుపురప్రాంతమం దుండువారము. యిప్పుడు శ్రీ పెరుంబూధూరున స్థాపింపబడినత్రయ్యంతద్వయవర్ధినీపాఠశాలయందు పాణినీయశాస్త్రాభ్యాసమును జేయుచున్నారము. ఇదివఱకే తమదిగంతవ్యాప్తనిర్మలయశశ్చంద్రికచే నస్మదీయమానసచకోరకము లపరిమితానందభరితము లయినవి. ఈప్రాంతముల గొందఱుతిరుపతివేంకటకవులయాధిక్యతిమిరంబున మునింగి యుండిరి. వారికి శతమ్ము

మున్నగునవి దెలియపఱచి, యథాశక్తిగ నుపన్యసించి తమపాండిత్య ప్రతిభాదుల వెల్లడించి మీకీర్తియనుచంద్రికచే నాతిమిరంబును బాపి సముద్రమును నిచ్చుచున్నారము.........గాని ... .....నత్యద్భుతశతావధానము మున్నగునవి లభింపకపోవుటచే గొంతకొఱంతగ యున్నది. యీవిజ్ఞప్తి యందినవెంటనే తమగ్రంథమాలాప్రథమగుచ్ఛమును వి పి. మార్గముగ దయసేయ గలరని ప్రార్థించుచున్నారము.

16 ఏప్రియల్ 1912 ఇట్లుతమవిధేయులు

సాంస్క్రిట్ కాలేజీ కుందూరి శ్రీనివాసాచార్యుడు,

శ్రీ పెరుంబూధూరు. చక్రవర్తుల రంగాచార్యులు

చంగల్పట్టు డి॥

---

12—12—10

అయ్యా! నమస్కారములు.........మీరు వసుంధరపతిరికకుం బంపినవిమర్శఖండనము జూచినాను......వారు మరల కవితావిమర్శన ఖండనముండనమని వ్రాసి శశిలేఖకు బంపినారు. వారు బహుతొందర మనుష్యులుగాన వారు వ్రాసినది జాగ్రత్తగా చదువవలయును. మీరు వారికి చిక్కకుండా బహుజాగ్రత్తగా మీరు వ్రాయునది వ్రాయ వలయును. ఆచార్యులుగారి పేరుగాని శాస్త్రిగారే వ్రాయుచున్నారు. నానారాజసందర్శనము మీయొద్ద నున్నట్లయిన 75 పేజీలో దామర వంశోద్భవుడు దార॥ అనుపద్యములో ప్రాసపోయినది గాన మీరును దానిని జూడుడు.........

చి త్తగించవలెను.

చింఛినాడ వెంకటరత్న శాస్త్రి.
బందరు, చింతగుంటపాలెం.



శ్రీమద్రాజేంద్ర సేవితాంఘ్రి ఘనరసోద్భవయుగళులు కళీ
మిత్ర విందాహ్వాన్నాధసద్గుణాపీణనాంధ్ర సంస్కృతపటుత్వకవితా
శారదులును నైన వేంకటరామకృష్ణార్యులకును

క. హనుమన్నృసింహులము వం
దనకోటుల నాచరించి నయతరవిజ్ఞా
పనముల లిఖించువారము
వినుడీ సోద్ధూతవృజినవిస్తృతులారా.........

చ. తిరుపతివేంకటేశ్వరులతీరున జేయకు డార్యులార దు
స్తరమతి నూజివీడ్కృతవధానమునం దొకతప్పు దోచి వా
రిరువురి పేర వ్రాసితి మహీనధృతిన్ బొరపాటొ లేక నే
తెరవున వ్రాసినారలొ ప్రతీతిగలట్టిమహాకవీశు లీ
సరణి లిఖించ లక్షణవిచార మెరుంగని బాలిశాధముల్
విరివిగ నెట్లు వ్రాతు రిది పెద్దలు మీర లెరుంగకుండురే
స్థిరముగ వ్రాయుడీ యని విచిత్రత మంబయినట్టిపద్య ము
ద్ధురగతి వ్రాసి దానికిన్ని ధుర్ముఖులంచని కోపగించకన్
సరసత నుత్తరంబిడుచు సత్కరుణన్ శుకరంభవాద మిం
పురుసన బంప మిమ్ములను బ్రార్థనజేయుచునుంటిమంచు సొ
త్కరముగ లేఖనంప సముదంతమువ్రాయక మేము పంపున
త్తరమన్నియుంతవ్రాసి కడుదప్పుగజూపదునట్టిపద్యముల్

బరువనివీడి యంతఁబారపాటనిచుక్కలఁబెట్టినా రదే
మొ రహిః శతావధానచయభూరిసుసారము నందు దాన మె
త్తురె మిముబోలుపండితులు దుండగులంచని గేలిసేయ రే
పరువుగఁ బుస్తకమ్ముఁ బనుపన్ దగుచార్జిని గోర నివ్వమే......

క. ధరసాధారణసంవ
త్సరపుష్యసితాష్టమినిద్విషాంపత్యురువా
సరమున వ్రాసితి మిది..........

దివ్యచిత్తమునకు దేవలయును. ఇట్లు విన్నవించువిద్వజ్జనవిధే యులు, గోపాలుని హనుమంతరాయశర్మ, పోతరాజు లక్ష్మీనృసింహ శర్మ, అష్టావధానులు.

---

ఆంధ్రపత్రిక. బొంబాయి. 20-3-13 విన్నపము:—

... ... ... మఱియొకవిషయము. తిరుపతి వేంకటేశ్వరులగ్రంథములవిషయమై యొకచిన్నవిమర్శనమును బంప గలరా? పేరు దెలుపకుండ ముద్రింపబడును.

విధేయుఁడు,

ఆ. నారాయణరావు.

ఇట్లు పలువురు కోరినను వారిగ్రంథములలో నీతిబాహ్యములై ఖండింపవలసినవిషయము లనేకము లున్నను రామకృష్ణు లుపే క్షించిరి.

మీకవితావిమర్శనఖండనమును జూచి యమందానందమును జెందితిని మిమ్ముల దర్శించి మదీయకిల్బిషంబుల హరింపఁజూచుచుంటిం గాని యట్టిభాగ్యంబు లభింపదయ్యె.

ఓలేటి సత్యనాథం, కోటిపలి.



వారికిని మీకును జరిగినఉత్తరప్రత్యుత్తరములు కూడ పంపించి ఇవి తప్పకుండా పెట్టవలెనని నొక్కి వ్రాసిరి. గనుక మీరును పూయందు దయయుంచి మీరురచించినపొత్తములను దయచేయమని ప్రార్థించుచున్నాను.

సరస్వతీ శక్రటరీ
నరసింహదేవర సత్యనారాయణ.



బ్రహ్మశ్రీ రామకృష్ణశాస్త్రులవారికి నల్లాచక్రవర్తుల వెంకటాచార్యులు నమస్కారములు. బ్ర. చళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు పశ్యాపశ్యైనపశ్యతః అనుసమస్యను తప్పని దానిమీద గ్రంథము వ్రాసి ఆగ్రంథమును పశ్యాంపుశ్యాం అనుపేరుపెట్టి ... ... ... దానిమీద నేను ఒకకరపత్రిక వ్రాసినాను. దానిమీద భగీరథశాస్త్రిగారు ఒకపత్రికను వ్రాసినారు. దానిమీద నేను మళ్లి ఒకపత్రికను వ్రాసినాను. ఆమూడుపత్రికలు పంపినాను. మీరు బాగా విచారించవలెను. ... ... ... ... రాయుడుశాస్త్రిగారిక వగయిరా చాలామందికి ఖండనవ్రాయ మని వ్రాసినట్టు విన్నాను. అనేకమంది అనేకవిధములుగా వ్రాసిపంపినారట అందు భగీరథ

F1

శాస్త్రిగారిపత్రిక మాత్రం అచ్చువేయించినాను. .........బెజవాడలో పాటిబండ వెంకటరమణయ్యగారు రాయుడుశాస్త్రిలుగారిపత్రిక మనకు అనుకూలమనిన్ని వారివద్ద ఉన్నదనిన్ని అది అచ్చువేయించి కొన్ని ప్రతులు నాకు పంపుతామనిన్ని వ్రాసినారు. అది పంపినవెంటనే మీకు కూడా పంపుతాను. .........12-10-12.

---

ఆకొండి రామమూర్తి చిరాయురారోగ్యాభివృద్ధిగాను పుత్రపౌత్రాభివృద్ధిగాను ఆశీర్వదించి వ్రాయునది

ఈమధ్య దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు మీపేర వ్రాసినవియు మీజవాబులను చూచియున్నాను. తిరిగి వారు చాలఅసూయాగ్రస్తతతో వ్రాసి యచ్చువేసినపద్యములును వచ్చినవి. దరిమిలాను మీ రేమియోచించుచున్నదియు వ్రాయవలయును. నాయభిప్రాయము వ్రాయుచున్నాను. మీరు తిరిగి యంతతీవ్రముతో వ్రాయవద్దు ఇందువలన నేమియు గౌరవము లేదు. తెలియనేర్చినవారికి వారిపద్యములవలననే తెలియుచున్నది. మీరు శిష్యులుగా నుండినయెడల వారికి గౌరవము రాగలదని వారియభిప్రాయమని తోచెడిని. వేంకటశాస్త్రిగారికి నీవు బాకీయున్నట్టు వ్రాసినారు.అది యెంతవరకు నిజము. బాకీ లేనిచో గుడిలో నాసొమ్మిచ్చిన తీసికొనివెళ్లగలడేమో జవాబు వ్రాయవచ్చును.

సాధారణ సం॥ శ్రావణ బ ౧౧ జయవారము. గ్రహించవలయును. ఆ. రామమూర్తి.

---

చె. వేంకటాచలముగారు రామకృష్ణులకు ముఖ్యబంధువులును, ప్రసిద్ధ శుద్ధచరిత్రులు నగు నిద్దఱను దనవర్తనము మంచిదని తెలుపుటకయి సాక్షులుగా వ్రాసికొనుచున్నారు. వారు తనచేష్టల నెల్ల స్పష్టముగాఁ జెప్పి యీవివాదములోఁ బ్రసక్తిఁ గలుగఁజేసికొనుటకిష్టములేనివారని యెఱింగినవాఁడై రామకృష్ణులబంధువులనే యీయన నిశ్శంకముగా సాక్ష్య మడుగుచున్నాఁడు. "తాను మంచి వాఁడు గాకపోయినచో న ట్లడుగఁగలఁడా" యని లోకులు తలఁచుటకై యీపన్నాగము చేసినాఁడు. కావున నాసాక్షులలో మొదటివారి యభిప్రాయమును దెలుపుటకై పైజాబు ప్రకటింపవలసివచ్చినది.

సూచిక — ఈబాకీనిగుఱించినకథ నవ్రస్తుతప్రశంసలోఁ జదువునది.



బ్ర. శ్రీ అత్యద్భుతశతావధానులు రామకృష్ణకవులసన్నిధిలో సరస్వతుల వేంకటసుబ్బాశాస్త్రి వ్రాయువిజ్ఞాపనము.........

మొదట మీకును బ్ర. శ్రీ శతావధాని తిరుపతిశాస్త్రిగారికిని వివాదము జరుగుచున్నట్లు శశిలేఖలోనిపద్యములవలన దెలిసికొఁ గలిగితిని. ......ఇది యిట్లుండగా తమకవితాపత్రికనుగురించి ఖండనముండనాదులు శశిలేఖవలన దెలియుచున్నవి. మధ్య నాయాచార్యులగా రెవరు వారికిని మీకును విరోధకారణ మేమి? 'యావజ్జీవం హోష్యామీత్యావయోస్సఁకల్పః' అను ఆచార్యులగారివ్రాతలోని ద్వివచనమున కర్థమేమి? తమ రాంధ్రపత్రికలో తిరుపతివేంకటకవులదేవీభాగవతమును విమర్శించి ప్రచురింతుమని వ్రాయుటకుఁ గారణ మేమి? ......వలయునంత వెంటనె శ్రమలని ఆలోచించక నాసంశయమును దీర్తురని నమ్ముచున్నాను. నే నిట్లు తమరిని గోరినందులకు

మన్నింపవలయును. ... ... ఇంతే అనేక నమస్కారములు.

18—12—10 మద్రాసు.

శ్రీవణానందమునందు నిశ్లే వేంకటాచలముగారు మధుసూదనాచార్యుఁడని పేరుపెట్టుకొని తేలిపోయినాఁడు. కవికివలయు తన్మయత్వ మీతనికి లేదు.

---

8 నెం 10 బందరు.

... ... ... చదివినకొలంది మీపూర్వపుణ్యా మభివర్ణించుటయే పనిగా జరిగినది. రసవంత మై ముద్దుగుకవిత్వ మాశువుగా లభింప నేరు వర్ణింపరు. ఎవ్వ రేమన్న లెక్కగాని యిప్పట్టున మీధార యప్రతిమాన మనఁ జెల్లునన వెనుదీయ ... ... ... స్వాయత్తముగాని చిత్తము తత్తరపెట్ట మత్తిల్లి యుత్తవాగుడులకు నోరెత్తు. అట్టివారి నెల్లరును వట్టివారే యనఁగాఁ జూచుచుండ లేదా?...

హితుఁడు నాదెళ్ల పురుషోత్తముఁడు.

---

పర్చూరు 24-6-15.

... ... శత్రుగర్వాపహారణులును అగుతామకృష్ణకవివరులసన్నిధానమునకు.

నేను మీపత్రికాలలామంబునకు భారతాదిని చందాదారుగా నుండుటయు పిదప శాశ్వతచందాదారుగానుండుటయు గల్గినది. ఇది యంతయు మీపత్రికామహిమయు మీపరాక్రమమును మీవిద్వన్మ

హిమయు నని వ్రాయుట యనవసరము. ... ... ... ఈ సంచికయందు ప్రకటింపఁబడిన పస్పశమును చూచితిని. దానివలన తి. వేం. కవులప్రయత్నములన్నియు బయలయ్యెను. వారిచర్య మొదటినుంచి యీప్రకారంబున నున్నది. వారిజన్మకాలమహాత్మ్య మెట్టిదోకాని ప్రతివానితోడను విరోధించి మొదట నాల్గుతిట్లు తిట్టి వారిచే మరల తిట్టులబడుచు పలాయనమగుదురనుట కనేకదృష్టాంతరములు గలవు. దీనికి వారినానారాజసందర్శనమున ఎట్లో విద్యల నభ్యసించికొని, అనుపద్యమే మొదటినిదర్శనము. రెండవది నర్సారాయనిపేటయు మూడవది మీయదియు నాల్గవది శ్రీకొప్పరపుసోదర కవులును, ఇంకను అనేకనిదర్శనములు కలవు. ... ... కావున మీరు భారతమును సరిపెట్టక బయలువడుదురు గాక!

మిన్నికంటి వేంకటేశ్వరులు.

ఇట్టియుత్తరములు ప్రకటింపవలసినవి చాలఁగలవు. వానినట్లుంచి యిఁకఁ బద్యాత్మకములయిన కొన్నిలేఖలనుమాత్రమే ప్రచురించి వేఱొకవిషయమునకు వత్తుము.

---

పత్రికాధిపా! మదీయం బగునీచిన్నివిన్నపం బాకర్ణించి ప్రకటింప వేఁడెద.

చ. చెలువుఁ దలిర్చుమీకవితఁ జిన్నెలవన్నెల, భవ్యమాధురీ
కలితవచోనుబంధ మగుగాదిలికైతనుఁ జూచి మెచ్చితిన్
సలలితలీలఁ జెన్నలరుఁజక్కనిమీకృతు లస్మదీయహృ
త్తలము చిగిర్చె నన్యకవితాపరిభగణ్యామె? మీదుచెంగటన్.

ఇటుల విన్నవించు

దూపాటితిరుమల వేంకటరమణాచార్యులు.

పద్యశేషము.

ఉ. శ్రీకర వేదులాభిజనసింధుసుధాకర ! దీనమానసా
స్తోకముదాప్తిసంఘటనశోభితదివ్యగుణాతిశేకర
త్నాకర ! వైరిభీకర ! దయావినయాకర ! రామకృష్ణశా
స్త్రీ ! కవిచక్రవర్తి ! భవదీయగృహాఖ్యమహత్త్వ మెన్నగ

క. వేదులనగ జ్ఞానాంత
ర్వేదులు మరియుం ద్రికాలవేదులు బరిష
ద్వాదవిభేదకళాసం
వేదులు సకలాగమాంత వేదులు దలపన్.

ఉ. బాణమయూరమల్హణులభారవిబిల్హణకాళిదాసులన్
శ్రేణికొనర్పజాలుదువు జృంభితహృద్యమృదూక్తియుక్తగీ
ర్వాణకవిత్వధాటిఁ, బరిపాటిగఁ దేటగ మాటలాడు నే
రాణదలిర్చు నీకు సుకరంబుగ నింబుగఁ దెల్గుకబ్బముల్.

మ. సరసప్రౌఢిమ దండిసత్కవివలెన్ సాహిత్యలాలిత్యమున్
దలఁపన్ భూమి సురత్వవైఖరి లసత్తారుణ్యలావణ్యమున్
జలనం బించుకలేనిభూతివిమలైశ్వర్యంబు సుస్థైర్యమున్
గలపుణ్యాత్మక రామకృష్ణసుకవీ కంటిన్ నినున్ భాగ్యతన్.

క. వితతాశ్రియ ! వినుతక్రియ
వితథరహితహితమనోజ్ఞవిశ్రుతవచనా
కృతిరచనా నాదునమ
స్కృతి గైకొనుమయ్య రామకృష్ణకవీంద్రా !

క. తామాధ్వరం బొనర్చిన
రామయసూనుండ సుబ్బరాయాహ్వయుఁడన్
శ్రీమహితామ్మనప్రోలను
నామమ్ములుపేరు సజ్జనప్రియ వింటే.

శ్రీ

బందా సూర్యనారాయణవిరచితము.

క. సోదరకవిశత్రులు, దు
ర్వాదులు శ్రీరామకృష్ణపదవిద్వేషుల్
మేదురతరావలేపు ల
నాదృతు లయ్యెదరు గాదె యార్యావళిచేన్.

క. కవితాప్రతిపక్షుల స
త్కవి యెవ్వఁడుమెచ్చు నెవఁడు గౌరవ మిచ్చున్
భువి సద్దుష్టులదోష
వ్యవహారంబే శతఘ్నియై పడుగాకన్.

గీ. రామకృష్ణులు నిర్వురే భీమపార్థు
లిర్వురే యంచుఁ దలపోసిరింతెకాక
క్రవ్యభుక్కులుఁ గౌరవుల్ కదనవేళ
నెవ్వరెల్లరో యెఱుఁగరే యెల్లవారు ?

ఉ. వీరికసూయయంచును నవీనుల సైపరటంచుఁ గొందఱె
వ్వారొ వచింతుర్గాక యదివాస్తవమైనవధాను లెందఱు
న్నా రిపు డట్టివారిపయి నాకును నీకు ననూయలేక యి
వ్వారిపయిం బొసంగుటకు వారె యెఱుంగఁగలారటంచు న
వ్వారినొ గూర్చివార్యుగుణవంతుల కేటికొ నేఁటికయ్యముల్.

గీ. తీవ్రగర్వాధికతఁ జూపి, దేవునైన
లక్ష్యపెట్టము మాకు వల్లభులు లేర
టంచు బలుకుఖలులకు లభించుఁగాదె
దండధరదండనమొ? రాజదండనంబొ?

చ. మదమును క్రౌర్యమున్ గినుక మత్సరమున్ సుకవీంద్రనిందయున్
విదితవదాన్యశేఖరుల వేమఱుఁ జుల్కన సేయుచుంటయున్
బదపడి శిష్యవర్గములఁ బాఠములన్ జదివింపకుంటయున్
విదులమటంచు నిక్కుటయు విజ్ఞజనేతరనైజచిహ్నముల్.

చ. తెలుఁగున సంస్కృతంబునను దిట్టలమం చదలించిమీసముల్
నిలిపితి మందు కే యనుచు నిక్కి వచించి, తదీయులద్భుతా
మలధిషణాసమగ్రు లసమాను లనూనులు తారసిల్లఁ గా
నులికి పలాయనంబయి దురుక్తులుమాన రదేల దుర్మతుల్.

ఉ. రోసములేనిమీసములు రొయ్యకు బారెఁడు లేవె మున్నుతా
జ్జేసిన బాసల న్నిలుపఁ జేసికొనన్ వలెఁగాక లేఖనా
భ్యాసము గల్గునంతకె సెబాసని కాగితముల్ సిరా వృథా
చేసిన మెత్తురే కవులు ఛీ యనకుందురె సాటివారలున్.

శా. ఎట్టో విద్యలనభ్యసించి తిరిపెం బెట్టోగణింపంగఁ జా
రట్లట్లై గరువంబుఁ బూని "తగునయ్యా!" యంచు వర్తించినన్
మొట్టుల్మొట్టి కలట్టిగర్వమును దుమ్ముంజేతురార్యోత్తముల్
కట్టా సజ్జననింద దుర్జనుల కిక్కట్టుల్గదుం గూర్పదో.

మ. ఔనె? యసూయ? నీదయినయాగడమెల్ల నెఱుంగనాయె నీ
దీనత తెల్లమాయె త్వదధీనులదుర్గతి స్పష్టమాయె నీ
మానము గాలిపో ననుచు మానక దూఱిరి దేని, వట్టిదా
దాని నసూయ నూనుకొని తామటు లై రిపుడేలకో ఘనుల్.

చ. ఘనసభలందు నిల్చి తగుకల్పన లాశుకవిత్వమందుఁ జె
ప్పనిపుడుఁ డైనయట్టిమగవాఁ డయినన్ సభ కేగుదెంచి శ
క్తిని బ్రకటింపరాదె యని తెల్పియు నాశుకవీంద్రసింహులన్
గనుఁగొన నోడి సుద్రిక్కుటె మగంటిమియో మగపాడియో గదా.

మ. బహుశాస్త్రంబులు వచ్చు, మాకనుచుడంబాల్ గొట్టుటే కానిమో
ట్టిహజారంబున నెట్టిశాస్త్రమున నేఁ డీకొన్నదే లేదు పై
నిహిహీంయ న్నగుబాట్లఁ బాసినది లే దీనాఁటికాలాటిదు
ర్వ్యాహితప్రజ్ఞుల నజ్ఞులఁ దలఁప సద్విద్యార్థు లౌనందురే.

ఉ. ఎరినో తిట్టుచుందు మెపు డెవ్వరిమీఁదనో తిట్టుపద్యముల్
వారక వ్రాయుచుందు మది వల్దనువారెవ, రట్టి వారలఁ
మారణహోమముఁ సలుపమా యనివల్కుదురంట యట్టివా
ర్వారిముఖాముఖంబడిన వారికొ వీరికొ తేలకుండునే.

చ. గడుసుఁదనంపుఁబోకలకుఁ గాలును ద్రవ్వుచు హెచ్చువారి నె
ప్పుడుఁ గడునిందసేయ యశము న్గడియుంచుట వట్టిసున్న యి
ప్పుడమి వసింపభారమని బుద్ధిజనింపఁ దపస్వివృత్తిలో
నిడుకొని 'కానలం దిరుగనేగినఁ గోర్కె ఫలింపకుండునే?

గీ. క్షమఁ జతుష్పాత్తులందు రాసభమురీతి
నండజకులంబునందు వాయసముభంగి
తాపసజనంబులం దతికోపిపగిది
మెలఁగుధూర్తుండు నైచ్యంపుమృగముగాఁడె.

క. ఎచ్చటకు న్దమరేగియు
ముచ్చటగా వచ్చినట్లు మునువినలేదా
మచ్చరపుఁ గచ్చిపోతులు
సచ్చరితులమనుచు వ్రాయజంకరు భళిరే.

క. కలములు గలవని కాగిత
ములు గలవని యచ్చుయంత్రములు గలవని ప్రా
జ్ఞుల దిట్టి వ్రాయఁగనె లో
కులు మెత్తురు దుష్కవులను ఘూకవులనకఁ.

గీ. వ్రేలుసూపినయంతనే కాలుసాపు
వారుఁ గలరది యెంచక పాడువ్రాఁత
వ్రాసి సూడులు పెంపకుం డీసుమాని
మానమును నిల్పుకొం డసామాన్యమతులు!

క. తగువారు లేరె పార్థుల
కగణితబలయుతులు కొందఱైనను బహుళం
బుగ మూఁకగల్గెనని ని
క్కఁగఁ గౌరవు లేమిజయముఁ గాంచిరొ చెపుఁడీ?

చిత్తగించవలెను. బందా సూర్యనారాయణ. బి. ఏ. సీనియర్ విద్యార్థి. కృత్తివెంటివారి అగ్రహారం, బ ం ద రు.

---

చ. గురులను గెల్వఁజాల మిఁకఁ గూరిమి శిష్యులమీఁదఁబడ్డచో
సరగున గెల్వవచ్చునని సాహసకృత్యము లాచరించు నీ
తిరుపతివచ్చుచో నితని తెల్వియుఁ దేటయుఁ జూడకుండ స
త్వరముగఁ బోవనిత్తుమొకొ తథ్యము నమ్ముఁడు శిష్యవాక్యముల్.

క. ఇప్పగిది వీరలెపుడుఁ
జొప్పాకును బోలుకవితఁ జూపఁగ నిగురుల్
గప్పిన నిప్పులవలె మీ
రిప్పట్టున నూరకున్న నెగ్గగుఁ గృష్ణా.

విధేయుఁడు వేంకటాచలపతిశాస్త్రి.

---

బ్ర|| శ్రీ. వేలూరి శివరామశాస్త్రిగారిని గుఱించి విశేషముగా నేమియు వ్రాయనక్కఱలేదు. మా వేదాల తిరువేంగళాచార్యులుగారు రచించిన శైష్యోపాధ్యాయికను దీని కనుబంధముగాఁ గూర్చినం జాలును. ఐనను శాస్త్రిగారి శక్తిస్వభావములను మఱింత వెల్లడి చేయువిషయము నొకదానిని మనోరంజనినుండి గ్రహించి యిట వ్రాయుట యప్రస్తుతముగాదు.



... ... ... ... కాని యాయుత్తరక్షణముననే యెల్లవారి శ్రైమ్మదికిన్ని భంగముకలిగించు వింతవిషయ మొకటి తటస్థమయ్యెను. అది యవివేకకృత్యమును అసభ్యమునైనను,సోదరకవుల ప్రతిపక్షులు పైకిఁ జెప్పుమాటలును, లోపలఁజేయు నధమకార్యములును మాచదువరులకుఁ దెలిసియుండుటకై దాని నిచ్చట సంగ్రహముగ నుదాహరించుచున్నారము.

పైని దెలిపినవిధమున నందరఱమును బద్యములం జదువుట యైనవెనుక ... ... ... అను వైదికబాలుఁ డొకఁ డొకకాగితమును జేతఁ బట్టుకొని వడఁకుచు లేచి నిలువంబడి గద్గదస్వరముతో "సోదరకవులారా! చెందుృడికో నూలుపోగన్న సామ్యంగా నేనుగూడా రెండుపద్యాలు చదవకోర్తాను" అనిపలికి యొకపద్యమును జదివెను. అది సోదరకవుల సామర్థ్యమును బ్రశంసించునదిగా నుండెను. తరువాత మఱియొకపద్దెమును జదివెను. అది సోదరకవులం గేవలము నిందించునదిగా నుండెను! దానిని వినినతోడనె శీతకాలమునందలి సముద్రమువలె సభయంతయు నొక్కమారుగ ఘూర్ణిల్లెను. ఈచెయ్దము శివరామశాస్త్రి దని యెల్లవారికిం దోఁప, గొందఱిదృష్టి యాయనను వెనుకసాగెను.

కాని, శివరామశాస్త్రిగారు తెల్లవారివలె స్థిరముగా నొకచోటఁ గూరుచుండక, యేకారణముచేతనోగాని మొదటినుండియుఁ గొంచెముసేపొకచోటను మఱికొంచెముసేపు మఱియొకచోటను, నీవిధముగఁ బెక్కుచోట్లఁ గూరుచుండినవారై, యీసమయమున వెలుపలి కేగి యుండిరి. ఆయన యేదియో దురభిప్రాయముతో వచ్చియుండు నను తలంపున మొదటినుండియు నాయనజాడలం గనిపెట్టుచున్న వారి కాసమయమునం దాయన వెలుపలి కేగియుండుట మఱింత నమ్మకమునకుఁ గారణమయ్యెను. ఈలోపల యగ్రాసనాధిపతిగా రాబాలునాకాగిత మిమ్మని యడుగ, నతఁ డీయవచ్చునో యీయఁగూడదో యడిగి వచ్చెద ననిపలుకుచు శివరామశాస్త్రిగా రున్నయెడకుఁ బోఁజూచెను. కాని, తోడనే సభ్యులు కొందఱా బాలుని వెంబడించి, యాకాగితము నూడఁబెరికికొని తెచ్చి యగ్రాసనాధిపతిగారి కొసఁగిరి.

పైని దెలుపఁబడినస్వాములవారికిని శివరామశాస్త్రిగారికిని జాలదినములనుండి యుత్తరప్రత్యుత్తరములు జరుగుచుండుటం బట్టి యాస్వాములవా రాకాగితమునందలి వ్రాలు (దస్తూరి) శివరామశాస్త్రిగారిదేయనియుఁ, దమకడనున్న శివరామశాస్త్రిగారి లేఖలన్నియు నేకలముతో * నేసిరాతో వ్రాయఁబడెనో యాగొట్టపుఁగలము (Fountain Pen) తోనే యిదియును వ్రాయఁబడె ననియుఁ దెలిపిరి. సోదరకవులహృదయములయందు రవులుకొనుచున్నరోషాగ్ని యంతట

---

* ఈపద్దెములను వ్రాసినసిరా సాధారణముగ నెల్లవారికడనుండునట్టివానిలోనిది కాక, ఆకుపచ్చరంగు కలదిగా నుండెను. మఱునాఁడు శ్రీస్వాములవారికడనున్న శివరామశాస్త్రిగారి జాబులం బరీక్షింపనవి యన్నియు నీసిరాతోనే వ్రాయఁబడియుండెను. దస్తూరికూడ నొక్కటియే యని చూచినవా రందఱికిని దోఁచెను.

నొక్కసారిగఁ బ్రజ్వరిల్ల, వారివదనగహ్వరములనుండి యసంఖ్యాకము లగునగ్నికణములు పద్యరూపమున వెలువడెను. అయ్యావేశసమయమున శివరామశాస్త్రిగారి నుద్దేశించి వారుచెప్పిన పద్యములలో సాధారణమగు నొకదానినిమాత్ర మిట మచ్చున కుదాహరించెదము.

"గీ. రోసమున్న నిజంబైన మీస మున్నఁ
జారిపోవుట కూడదు పంద వగుచు;
ద్వైతవనమునఁ బాండవోత్తములచేత
సింధుపతి వడ్డపాట్లు గాంచెదవు రమ్ము."

ఇట్లు మర్మవిభేదకములగు పద్యవిశిఖములం బరపుచు నెదుటికి వచ్చి తమ్ముఁ బ్రతిఘటింపవలసినదని వారెంత తగిలితగిలి పిలిచినను నెదుటికివచ్చి వారి నెదిరించినవారు లేకపోయిరి. ... ... ... శివరామశాస్త్రిగారు వారిపద్యాశుగములు చెవులం దూసికొనిపోవుచుండ రిచ్చవడి వెలుపలివారు వెలుపలనే యుండుటయుఁ జూచి యగ్రాసనాధిపతిగారును సభాకార్యనిర్వాహకులును సనునయవాక్యములచే శాంతపఱిచినమీఁదట సోదరకవులు తమ మొదటిధోరణి తగ్గించి వారిసౌజన్యత కాభరణములయిన యీక్రిందిపద్యములఁ జెప్పిరి.

చ. జనమత శక్తిసంపద నసాధ్యు లభేద్యులు నైనవారితోఁ
దనలఘుశక్తిఁ జూడక మదంబున మార్కొనఁ జూచువాఁ డిఁకే
మన, శతకోటిదఘ్న మగునట్టి మహాహ్రదపాత మాత్మనా
శనమును గోరి సేయుటకు సాహసికుం డగువానిఁ బోలఁడే!

చ. తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుల మేమటంచు మా
గురువులు వారటంచు ననుకొన్న ప్రభాకరశాస్త్రిముఖ్యు లి
ప్పురమున దుర్వివాదముల పాలయి దుర్యశము న్గడించిరే!
హరహర బాల్యచేష్ట విడనాడని నీ వొకరుండు దక్కఁగన్,

ఉ. ఆశలడంగి నీగురుల యంతటివా రెదిరింపలేక యా
వేశము దక్కియుండి రిఁకఁ బిన్నవు, కాఁగలవాఁడ విప్పుడే
యాశుకవీంద్రసింహముల కాగ్రహముం గలిగింపఁజోక వ
త్సా, శివరామశాస్త్రి! సుగుణాఢ్యుఁడవై యశముం గడింపుమా.

ఇంతకు మున్ను ప్రచురించినయుత్తరములవలనను, అట్టహాసములోఁ గూర్చినపత్త్రికాప్రహసనమువలనను జాలవఱకుఁదిరుపతివేంకటకవులపక్ష మెంతన్యాయమో సులభముగా నూహించుకొనవచ్చును. ఇంకను వారినిగుఱించి విశేషముగాఁ దెలిసికొనఁగోరువారలకై వార్తాపత్త్రికలలోనిసారాంశములు మఱికొన్ని యీక్రింద వ్రాయఁబడుచున్నవి.

౨ జూలై ౧౯౧౩
ఆంధ్రపత్రిక.

« గంద్రతనము కవిత్వ మగునా? వటవట వదరుట వాచానైపుణ్య మగునా? అసూయాపిశాచావిష్టుఁడు కవియా? సమీచీనయోచనాభావదుర్భావుఁడు కవియా? కష్టనిష్ఠురవచఃపుంజాసమంజసుఁడు కవియా? మనోలాఘవసనాథుఁడు కవియా? ఈతఁడే కవియగునెడల గానింపు. ఈవాక్యములను చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు జ్ఞప్తియం దుంచుకొనఁగోరుచున్నారము »

౨౯-జూన్-౧౯౧౩
హితకారిణి.

« నిజము వినుఁడు. గుంటూరులో శివరామశాస్త్రిగా రవధానము చేసినప్పుడు జరిగినయవకతవకలకు సత్యవాది యను పేరున నెవరో యొకరు లేఖగా వ్రాసిరి. ఆలేఖ నాంధ్రకేసరి ప్రకటించెను. ఆలేఖలో శివరామశాస్త్రిగారనుటకు నిస్సారముగా శివరాముఁడని యనిరి.

అంత గుంటూరులో వారికి ముఖ్యులగువారు ఆంధ్రకేసరిని నీవు శివ రాముఁడని ప్రకటింపవచ్చునా? అని ప్రశ్నించి ఉత్తరము వ్రాసిరి. అందుకు ఆంధ్రకేసరి సత్యవాదిగారిలేఖలో శివరాముఁ డనుట పొర పాటే అని దిద్దుపాటుచేసెను. అది యిట్లు జరిగియుండఁగాఁ దిరుపతి వేంకటేశ్వరులు సత్యవాదిగారిలేఖయంతయు నసత్యమైనట్లును,ఆంధ్ర కేసరియే ఆలేఖను అసత్యమని నిరసించినట్లును వ్రాయుటయే గాక ఆసత్యవాదిగారిఁవ్రాఁత "చచ్చినవ్రాఁత" అని కూడ లిఖించిరి. అంతటితో నూరకుండక పత్రికాధిపతులందరినిఁ దమకనుకూలముగా వ్రాయుఁడని కోరుచుండిరి. ఇది సంభావ్య మైనమార్గము గాదు.ఇట్టి తంత్రములను సరిగాఁ బరిశీలింపక పత్రికాధిపతులు తొందరపడరాద ని మనవిచేయుచున్నాను. ఈసంగతులలో నిజము తెలిసికొనుటకు బొగ్గరపు శ్రీరామశాస్త్రిగారు ఆంధ్రపత్రికాసంపాదకులకు వ్రాయఁగా వారు "శివరామశాస్త్రిగా రనుటకు శివరాముఁడు అనుట పొరపాట ని దిద్దుపాటుచేసితిమి గాని సత్యవాదిగారిలేఖ యసత్యమైనది గాదు" అని ప్రత్యుత్తరమును వ్రాసిరి. కావున సత్యమును విచారించు తిరుప తివేంకటేశ్వరులకుతంత్రములం బరిశీలించుట సర్వోత్తమము. ఇట్లే నేకులను వంచించి జాబులను వ్రాయించుకొని "గుంటూరుసీమ" అను పేరు గలఅసత్యగ్రంథమును వ్రాసిరి.

అంద్దకి నరసింహము.

౨ నవంబరు ౧౯౧౩.

హితకారిణి.

సత్యాభిలాషులైనప్రాజ్ఞుల కొకవిజ్ఞప్తి.

శ్రీకొప్పరపుసోదరకవులు కాకినాడలో సభలుచేయునప్పుడు తిరుపతివేంకటేశ్వరులు ప్రచ్ఛన్నవేషధారులై సభామందిరములదాపు

ర పార్శ్వప్రదేశములయందు కూర్చుండి తీవ్రము లైనపరీక్షాపద్య ములను వినియు రోషగించుకొని యెదిరింపక మరలి యింటికిఁజనిన ట్లు వారిచేఁ బెక్కుపర్యాయములు నేను వినియున్నాను. ఈసంగతినే మరల వేమవరములో కతిపయమిత్రజనసమక్షమున శ్రీ చె॥ వేం॥ క విశాస్త్రిగారు చెప్పినట్లుగా జొన్నలగడ్డ శేషయ్యగారు అనునొకవైది కశిఖామణి నర్సారావుపేటలో శ్రీకొప్పరపుకవులసన్నిధినిఁ జెప్పిరి. వీరు వైదికులైనను మల్లాది సోమయాజులుగారివలెను దదితరులైనను తిరుపతి కొండలవలెను ననత్యాఖ్యానలమున కొడిగట్టువారు కారు. ఈసందర్భ మున కృష్ణాపత్రికాప్రతినిధి గారైనబొడ్డపాటి శేషగిరిరావుగారును శ్రీరాయసము రంగేశ్వరశర్మగారును మఱికొందఱు పెద్దమనుష్యులు నుండి విని సమాధానపడి యున్నారు. ఇందువలన శ్రీకొప్పరపుసోద రకవులవిజయచరిత్రము విశ్వసనీయమును స్తవనీయమును నై యుండె ననుటకు సంశయము లేదు''

పి. శేషయ్య.

౨౨ ఫిబ్రవరు ౧౯౧౪.

హితకారిణి.

ప్రస్తుతవ్యాసకారణ మగువేమవరావధానారంభమున వేం॥ శా॥ గారు "చ. గిరగిరగిఱ్ఱగిఱ్ఱగిరగిగ్గిరగిగ్గిరగిఱ్ఱుగిఱ్ఱుగాఁ దిరిగెడిశీర్ష మే గతిని దేవి వధాన మొనర్పనేర్తు" అని చెప్పికొనితో యుండిరి. కావు నను వీ రవధానమునకుఁ దగరని మన మిపుడు వేఱుగా నిశ్చయింపఁ బనిలేదు''

౫ అక్టోబరు ౧౯౧౩

హితకారిణి.

మఱియు వీరు సత్కావ్యరత్నములలో రత్నము శనిగ్రహ

ము. ఇందలిపద్యములు తమ్ము జయించినయొకపండితుని గీసిపోవునట్లు తిట్టినబూతులుపండితులు గాదుగదా పామరులయిన నుపయోగింపరు. ఇట్టిబూతులబుంగలు సత్కావ్యములనియు లోకులందఱుబఠింపవలెననియుఁ దెల్పుచు ముద్రించి ప్రకటించుట ప్రపంచమునంతయు స్వమాయాంధకారమగ్నముగాఁ జేయనూహించుటే గాక వేఱుకాదు. కాన నిట్టిదుష్కావ్యనిర్మాతలకు సత్కావ్యనిర్మాణము పొసంగదనుటకేమిసంశయము.''

గోపాలుని లక్ష్మీనారాయణశర్మ,
వినుకొండతాలూకా ముప్పాళ.

హితకారిణి.
౧౦ ఆగస్టు ౧౯౧౩.

భాద్రపదమాసమున వెలువడినఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో "ఆంధ్రమహాకవిప్రశంస" అనుశీర్షికక్రింద మీకుఁ దెలిసియున్నఆంధ్రకవులను వరుసగా వర్ణించి కొన్నిపద్యములను వ్రాసితిరి. అందు మొదట నన్నయభట్టును దరువాతఁ దిక్కనసోమయాజిని బిమ్మట నెఱ్ఱాప్రెగ్గడను బిదప సోమునిఁ జెప్పి పదంపడి శ్రీనాథునిఁ జెప్పితిరి. ఇది యుక్తమే కాని ఆయనవెంటనే చెప్పఁదగుబమ్మెరపోతరాజును జాల నీవలవానిగాఁ జెప్పితిరి. అనఁగా శ్రీనాథునితరువాత పెద్దనజనించెననియు దరువాత భట్టుమూర్తి పుట్టెననియు జెప్పి వారికందరికిని గడపటివానినిగాఁ బోతరాజును జెప్పితిరి. ఇంతకన్నఁ జరిత్రజ్ఞానము లేనివ్రాఁత యనిన వేఱొకటి కలదా? ఆంధ్రకవులచరిత్రమేని చదువక ఎవ్వరెట్టివారో గ్రహింపక పండితవరణీయమైనపరిషత్పత్రికలో నిట్టిపద్యములను వ్రాసితిరి. ఆపద్యములు పైవిధమున సందర్భరహితములే గాక లక్షణహీనములుగా గూడ నుండెను. ౯ వపద్యముఅనగా శ్రీనాథుని

తరువాతఁ బెద్దన్నను జనింపఁజేసిన పద్యమునందలి నాల్గవపాదమున యతినాశ మొనర్చితిరి. "పృథివీనుండు భా। షానంతుండల పెద్దనార్యుఁడు బుధానందానుసంధాతయై" ఇట్టితప్పు లెన్నో యున్నను నట్టివాని నన్నిటిని బైటఁబెట్టక మనోరంజని మీచరిత్రజ్ఞానమును మాత్రమే తెలిపినది. దానిని గ్రహించి లజ్జించుటకు బదులుగా "గుంటూరిసీమ" లో ౭౩ పుటలో భాగవతమును దెనిగించిన పోతనామాత్యుని శ్రీనాథునకుఁ జాలనీవలివానిగాఁ దరువాతఁ జెప్పిరి. ౧౯౧౨ డిసెంబరు జనేవరు ౧౯౧౩ సం॥ మనోరంజని చూ॥ అని మనోరంజనిలోనిపంక్తుల నుదాహరించి దాని నాక్షేపించుచు "చూచితిరా తెలివి? శ్రీనాథుఁడును బోతన్నయును బావమరదు లనికూడ మాకుఁ దెలియదని యీపత్రిక యభిప్రాయము" అని వ్రాసితిరి. ఆమనోరంజని తెలివి యెట్టిదో చరిత్రజ్ఞానము గలవారికే యెఱుక. అది యట్లుంచి యిట్లువ్రాసిన మీతెలివినిబట్టి చూచుకొనుఁడు. శ్రీనాథుఁడును బోతరాజును బావమరుదు లనియే మీకుఁ దెలిసినచో పింగళిసూరన్నతరువాతవానిగా నేల వ్రాసితిరి. యతిప్రాసలు కుదరక పోయెనా? అట్లు కాకుండ నవి వేలువేలు పద్యములు గదా? అవి వరుసగాఁ జెప్పవలెనను నియమము పెట్టుకొనలే" దని పెట్టినసమాధానము నేని చెప్పుటకు వీలులేదు. ఏమన? నన్నయభట్టుమొదలుకొని శ్రీనాథునివఱకు వరుసగాఁ జెప్పితిరి. ఆ తెలివితక్కువను క్షమాపణచే దిద్దుకొనవచ్చును గాని పిచ్చియుక్తులచే దిద్దుకొనరాదు."

1913 జూలై 20 హితకారిణి.

వీరికి శతఘంటకవనంబు సల్పుసంగతి కరతలామలకమ్మట. శతఘంటకవనమ్మన నూరుమందిపృచ్ఛకులకు గవనము సెప్పుట. ఇట్లు చెప్పితిమనుటయేగాక "ఒకమారే యున నేమి లెక్క విను డోహో

పండితశ్రేష్ఠులార కడుఁ వేగమె వేయిమందికయినఁ ...... బొసరింప సేసుతుము'' అనికూడా జెప్పుకొనిరి. నిజముగాఁ బెట్టఁబూనినధనికుఁ డును దాతయు నగుసమర్థుఁడు నూఱుమందికన్నఁ గొందఱెక్కువగా వచ్చినచోఁ గొంచెము కష్టముగా నాలోచించును గాని నలుగురికై న నన్నముబెట్టజాలనివాఁడును నవాకలుచవాకులు వాగువాఁడును ధనహీనుఁడును లుబ్ధుఁను నగుడాంభికుఁడు తనశక్తి నెఱుఁగనివారు మెచ్చుకొనుటకును దననోటిదురద తీర్చికొనుటకును నేను వేయిమందికైనను నూఱుపిండివంటలతో నడిగినవారి కడిగినట్లుగా నన్నము బెట్టెదనని ప్రగల్భము లాడుటకు సంశయించునా? సంశయింపఁడు. అట్లే వీరు నిజముగా శతావధానాదులను జేయునది లేదు. కావునఁ జెప్పుటకు భయపడవలసినపని లేదు. బాపట్లలో ముప్పదిముగ్గురకును, నర్సారావుపేటలో నలుబదిమందికిని గుంటూరులో నలుబదిముగ్గురకును నవధానమునఁ బద్యములఁ జదువనోపక యాకలి యగుచున్నది. ఇప్పుడు చదువలేము. శేపు చదివెద మని వెఱ్ఱిసమాధానము చెప్పియు నగ్రాసనాధిపతిగారు మున్నగువారు పలువిధములు సాహాయ్య మొనర్చుచుండినను రెండుదినములకైనను నవధానము బూర్తి సేయుటయు బద్యములు మరలఁ జదువుటయు ననుపాపమునఁ బోక తమయప్పటియవస్థలఁ దప్పించుకొనుటకు మమ్మోడిపింపకుఁడనియు గర్భిణీసతులమనియు సభ్యుల నవేకవిధముల దేవిరించిరి. ఇట్టివారు నూఱుమందికేగాక వేయిమందికిఁ గూడఁ జెప్పుదు రనుట "ఉట్టె కెక్కలేనమ్మ స్వర్గమున కెక్కెద నన్నట్లే" తాము ముందు కొందఱికిఁ గొన్నిప్రశ్నములను వ్రాసియిచ్చి సభలో నివి కోరుఁడని చెప్పివారవి కోరఁగా మొదటినాఁటికే పూర్తి చేయుచు క్రొత్తవారు పృచ్ఛకులే కోరిన ప్రశ్నములలో మూఁడువంతుల కెక్కువగా మేము చెప్పఁజాల

మని ప్రార్థించియు నమస్కరించియుఁ జెప్పలేక చెప్పక తప్పించుకొనుచుఁ జేలికగా నున్నప్రశ్నములను మాత్రము విని వ్రాయించి మరునాఁటికిఁ బూర్తి చేయుచు, నప్పటికీ ధారణ నిల్వమిచే మరలఁ బఠింపఁబోయి యలజడిపడుచు శిష్యులును, మిత్రులును, బంధువులును స్వశాఖావరులు నగువా రనేకు లనేకరీతుల సాహాయములఁ జేయుచు నింద్రులని చంద్రులని స్తుతించి పద్యములను జెప్పి లోపములు లోకమునఁ బయల్పడకుండఁ గప్పిపుచ్చుచుండఁగా నవధానమను పేరుపెట్టి యేదో యొకతంత్ర మంతమంత్రించుచు మంచిచెడ్డలెఱుంగక శాఖాభిమానమే ప్రధానముగాఁ బెట్టుకొని తమచేసభ చేయించినవారివలన నూటపదాఱులు పరిగ్రహించుకొనుచు నీవలికి వచ్చి సభలోఁ జెప్పినట్లుగా నబద్ధపుఁబద్యములను బ్రకటించుకొనుచున్న శ్రీతిరుపతివేంకటేశ్వరుల కవధాన మెట్టిదో తెలియదనియుఁ దెలిసియున్నను న్యాయముగాఁ జేయఁజాలరనియు ననేకులు ఘంటానాదముగాఁ జెప్పుచున్నారు. నర్సారావుపేటలోఁ గారణాంతరమునఁ దమయందు భక్తిశ్రద్ధలు గలిగినట్లు పైకి నటించినమాయావులలోఁ గూడి పట్టుదలగలశాఖాభిమానులు కొందఱు సభ లనుపేరున బువ్వమ్ముబంతులాడించిన మీఁదట నీతిరుపతివేంకటకవు లవధానము న్యాయముగాఁ జేయఁజాలరని వదంతి గలుగుటచే నిజము నెఱుంగుట కొకన్యాయవాదిగారు న్యాయముగా శతావధానము చేసితిరేని మీ రడిగినట్లు ధనమొసంగెదనని చెప్పుటయే గాక పత్రికనుగూడఁ బంపిరి. అట్లే యనేకులు గూడ వ్రాసిరి. అందువలన భయపడి తమయం దభిమానముగల వారికిఁ గూడఁ దలవంపులు గలుగున ట్లెవ్వరితోడను జెప్పకయే పారిపోయిరి. గంగిరెద్దులయాటలలోఁ గోసంగిదాసుఁడు అనువేషధారి "అమ్మల్లారా నాదిపెండ్లి, అయ్యల్లారా నాదీపెండ్లి, అన్నల్లారా నాది

ఫెండ్లి" అని కేకలు వేయునట్లుగా మేము శతావధానులము మేము శతావధానుల మని ప్రకటించుకొనుట మిక్కిలి పరిహాసపాత్రముగా నున్నది.

హితకారిణి.

౩౦ నవంబరు ౧౯౧౩

బ్రహ్మశ్రీ గుండమరాజు పురుషోత్తమశర్మగారికి—

సన్మిత్రమా!

ఆగస్టు ౧౭ వతేదీని వెలువడినహితకారిణీపత్రికలో మీరు "తోడపిల్లికిబంటుతనము" అనుశీర్షికతోఁ బ్రకటించినవ్యాసమును హెచ్చరికతోఁ బఠించితిని. పురుషోత్తమానందకరముగా దుర్హృజ్జన భయంకరముగా గాండీవమాహాత్మ్యమును బ్రచురించినవిజయునివలె సూర్యానందకరముగా ననార్యజనభయంకరముగాఁగవితామహత్త్వమును బ్రకటించువిబుధప్రియులును శ్రీమత్పిఠాపురాస్థానవిద్వాంసులును నత్యద్భుతశతావధానులును నైన బ్ర.శ్రీ. వేంకటరామకృష్ణకవులను, దచ్ఛిష్యులైనబ్ర.శ్రీ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని బ్రాజ్ఞులు విశ్వసింపరానికొండొకనిమిత్తమ్మాధారముగాఁ జేసికొని రూక్షముగ నాక్షేపించినమీసాహసముఁ దత్సామర్థ్యానభిజ్ఞతాదోష మూలకముగా మీచే నెఱింగినవాఁడనైననేను వారినిగూర్చి మీవ్యాసమునుగూర్చి లోకులలోఁ గొందఱకుఁ గలుగుసందియములు నివారింపఁబడునట్లు నాచే నొనర్పఁబడిన యీయథార్థవిజ్ఞాపనమును సావధానులరై సాంతముగాఁ జిత్తగింపుఁడు. విద్వత్కవి, బాలసరస్వతి, శతావధాని, కి. క. పంచాననశతావధానీత్యాదినిరర్థకబిరుదనామధారు లయినతిరుపతివేంకటేశ్వరులు జరుపునకృత్యములకును, వానినెల్ల నెఱింగియుఁ బైకెఱుంగనట్లుండి వారిని బ్రహ్మరథము

బట్టి యూరేగించుచు నూరక తెగఁబొగడుతత్పక్షపాతుఁ దార్జన్యము లకును "శాత్ర్యంసదాదుర్జనే" యనునీతి ననుసరించి తగుప్రతిక్రియ లొనర్పక యుపేక్షించి యథార్థజ్ఞానాపేక్ష గలలోకమే న్యాయ వైచక్షణ్యమునకుఁ గలదని శుద్ధసాత్త్వికత్వమున నుండిరనికదా శ్రీవేంకటరామకృష్ణకవులఁగూర్చినయీవ్యాసరచనయందలియీయభిప్రాయము? ఆయీయభిప్రాయ మీతీరున నుండినను దుర్విమర్శకులు గ్రహించునది వేఱొకతీరు. అయినను సద్విమర్శకులు యీభావము గ్రహింపకపోరని నమ్మెదర.

కవిచక్రవర్తులశిష్యుఁడు
ఓంకారము గురవరాజకవి.

రోజు మంచిదని పట్టపగలేకన్నమా?

హితకారిణి.

**1913 సెప్టెంబరు 21–28**

వీరు చేయుశతావధానములయందు ఆశుకవిత్వముమాట చెప్పినప్పుడు చూచుకొందము. పూర్వము చేసియుంచుకున్న పద్యములం గలుపుచుండుటయు నింటికడఁ బద్యముల నాలోచించుకొని వానినే యడుగుఁడని తమకు లోపైనవారితోఁ జెప్పి యడిగించుకొనుటయు మొదలగునవి వీరికి సామాన్యకృత్యములే యనియు నట్లు గాక నిర్వహింపనే లేరనియు వీరిపద్యములచే స్పష్టపడినది. కోపావేశముచేత నోడలెఱుఁగనప్పు డేమన్నను దమశక్తి యెంతవఱకుఁ గలదో యంతవఱకే తమగ్రంథమునందుఁ జెప్పుకొనుట మిగుల సమంజసముగానున్నది. ఈవిషయమునందు వీరినిగూర్చి మే మెఱిఁగినదానికిని వీరు స్వయముగా వ్రాసికొనినదానికిని విశేషభేదము లేదు. వేమవరపు సభలోఁ గొంత రహస్యమునే గని పెట్టి పత్రికలకు వ్రాసితి కాని

వీరిగ్రంథములో నీ రీవిధముగా నొప్పుకొనియు వారు వ్రాసినది యసత్యమని సాధింపఁజూచుట మాత్రము వీరివెఱ్ఱిని వెల్లడిచేయుచున్నది. పోనిండు. వీరికి వెఱ్ఱి సహజమైన దనే యనుకొందము. పట్టినవాఁ డేమో యనఁ బైనున్నవాఁ డేమో యనెనన్నట్లు వీ రిట్లు తమశక్తి నిగూర్చి తామె యొప్పుకొనుచుండ వీరిపక్షులు నాకవనముకంటె నెత్తఁ జూచుట యెందులకో ... తమవలెనె లోకములో నందఱును బ్రాఁతపద్యములం గలుపుచుందురని వీ రనినందులకు నే నంతగ వింతపడను. ఏల యనఁ దమశక్తి నిబట్టి యెదుటివారి నూహించుట సాధారణ మైనలోకస్వభావము. ధర్మరాజున కయోగ్యుఁడును, దుర్యోధనునకు యోగ్యుఁడును నెందును గాన్పింపలే దనుకథ మీ రెఱిఁగియే యుందురు. కాఁబట్టి వీ రప్పటికప్పుడు చెప్పలేనివారు గావునఁ దమవలెనె యితరులును జెప్పలేరని యభిప్రాయపడి యుందురు. అడిగినపద్దెముల నన్నిటి నప్పటికప్పుడు చెప్పఁగలవా రెవ్వరేనిఁ గలరా లేక యంతఱును వీరివంటివారేనా యనుసంశయమునుగూర్చి యిప్పుడు విచారింపఁదలఁచుకొనలేదు. ఏలయనఁ బులిమీఁదఁ బుట్ర యనినట్లు వీరికి సంబంధించిన దింతకంటె వింతయగువిషయ మొకటి మీయెదుట నుంపఁబోవుచున్నాఁడను. ... ... ...

ఈసంవత్సరము ఏప్రిల్ నెల ౧౯-౨౦ తేదీలలో రాజమహేంద్రవరమున జరిగినపరిషత్సభయందు వీరిలో నొకరగుతిరుపతిశాస్త్రులవారు ఆశుధారగాఁ జెప్పిన ట్లభినయించుచుఁ గొన్నిపద్యములం జదివిరఁట. పరిషత్పత్రికయందు వానిలో మూఁడుపద్యములు ప్రకటింపఁబడినవి. వానిలో నొకదానికి యతిభ్రంశమును, రెండవదానికి భావభ్రంశమును సంభవించినను బహుశః యవిరెండును వారివే కావచ్చుననుతలంపుచే విడుచుచున్నాఁడను. ఇఁక మొదటిపద్యమును జిత్తగింపుఁడు.

" అష్టభాషలకు వాగనుశాసనుం డైన
నన్నయకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధమ్ముతో ముద్దుముచ్చటల్
తిక్కనకవి మున్ను తీర్చినాఁడు
పరువుగాఁ బల్లకిపై సర్వదేశముల్
శ్రీనాథకవి మున్ను త్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్
పెద్దన్నగారు పంపించినారు

గీ. ఆంధ్రభాషావధూటికో యార్యులార!
ఇచ్చవచ్చినయట్లు మీనచ్చినట్లు
నగలు నాణెంబులును బెట్ట నగునుగాని
సూత్రములు త్రెంపకుం డాంధ్రశూరులార!

ఈపద్యమును జిత్తగించితిరి గదా! స్వయంపాకల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే రచియింపఁబడి ౧౯౧౨ వ సంవత్సరమున, సీతిరుపతిశాస్త్రిగారుపనిచేయు (కాకినాడ) సరస్వతీముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడిన "సర్వశూన్యశతకమునందలి ౯౭ వ పుటలోని యీ క్రిందిపద్యమును జిత్తగింపుఁడు.

" అష్టభాషలకువా గనుశాసనుం డైన
నన్నయకవి పెంచినాఁడుమున్ను
ప్రేమానుబంధమ్ముతో ముద్దుముచ్చటల్
తిక్కనకవి మున్ను దీర్చినాఁడు
పరువుగాఁ బల్లకీపై సర్వదేశముల్
శ్రీనాథకవి మున్ను త్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్

పెద్దన్నగారు పంపించినారు
సేమములు శ్రాంతినీకుండ నిలిపినారు
సూనాదులు తక్క సశూరులెల్ల
నేటి కేతెంచెం గవితకు మేటికీడు
సకలగీర్వాణజనమాన్యసర్వశాస్య"

రెండు పద్యములయు గీతములు వేఱువేఱుగా నున్నను గుర్తులు వేయంబడిన స్వల్పపుమార్పులతో రెంటిసీసపాదములును సమానము గా నున్నవి. మార్పులైనను నాలవపాదమునందలి "మున్ను" అను దానికి "గారు" అనుట తక్క మిగిలినవి అక్షరభేదములై యున్నవి. ఈవిధముగా రెండుపద్యములు నొకేతీరున నుండుట కేమికారణమో, దీని నేమనందగునో చదువరులారా! నిర్ణయింపుఁడు. ఆపైని, వీరివీరావేశములును, వీరిషూడంబరములును, వీరిమీసపుంబందెములును, నెంతవఱకుఁ జెల్లునో యది మీకే విశదము కాఁగలదు. వెనుక వేమవరపుసభలో వేంకటశాస్త్రిగారు "శ్రీమంతం" అనుటకు బదులుగా "శ్రీవంతం" అనిరి యని యొకరు వ్రాసినపుడు శ్రీకృత్తివెంటి నాగరాజుపంతులుగారు, వేంకటశాస్త్రిగారియెడఁ దమకుఁగలవాత్సల్యమునుబట్టి వేంకటశాస్త్రిగారివంటివారు 'శ్రీవంతం' అనిరి యనుటకంటె భూమిలో వేంకటశాస్త్రిగారే పుట్టలేదన్నఁ గొంత సమ్మతవ్యము గా నుండునని సెలవిచ్చియున్నారు. ఇప్పుడు తిరుపతిశాస్త్రిగారిట్లు చేసిరనుటకంటె భూమిలోఁ దిరుపతిశాస్త్రిగారే లేరన్న నింతకంటె సందర్భముగా నుండునందురేమో! ఆశ్రితపక్షపాత మెంతకైనఁ జాలునుగదా?"

కాళ్ళకూరి నారాయణరావు.

---

హితకారిణి. 1914 మార్చి 8 తేదీ.

లోకములోని కవులందరు నాజంధ్యములోనివాండ్లే యనుటనే కాకరపర్తిలో శృంగభంగ మైనదని జ్ఞాపకము చేయుఁడు.

1914 మార్చి 1 తేది హితకారిణి.

అది యట్లుంచుఁడు. మొన్నమొన్న గాకినాడలో నీకవిసోదరులును వీరికి యుత్తరకుమారులను బిరుదము నొసంగియున్నారు.

రామకృష్ణకవులశతఘ్ని యాంధ్రభాషాజ్ఞానమున గొంత దెల్పి యున్నది కదా !

మఱియు వేం॥శా॥ ఆత్మకూరుసంస్థానమునఁ జెప్పినట్లుగా నానారాజసందర్శనములో 91 వపుటయం దొకపద్యమును వ్రాసికొనిరి. చం॥"అభినవరామలింగ బిరుదాంకుఁడ నాకవనమ్ము నందు నీ। యభణపుఁగాండ్లుతప్పులిడ నర్హులె కాదని తప్పదిద్ద మా॥ యుభయులలోన నొక్కఁడు మఱొక్కనికిన్ దగుఁగాక యీర్ష్యచే। నభముశుభమ్మునుం దెలియ కార్చెడుదేబెలు మాకు లెక్కయే"—ఇది యాస్థానవిద్వాంసులయొద్దనే కాక ఆపట్టణముననే చెప్పియుండ లేదు. "గుడ్డిగుఱ్ఱముతట్ట గుగ్గిళ్లు దినఁ బెద్ద రిక్తునిమనసు కోరికలఁ బెద్ద" అనునట్లుగాఁ దమకు వేం॥శా॥గారి అభినవరామలింగబిరుదముపైఁ గోర్కి యుండవచ్చుగాని తీర్చినవా రెవ్వరు లేనప్పు డది లభ్యమయినట్లుగా నభినయించుచు నచ్చట నట్టిపద్యమును జెప్పితిమని వ్రాసికొనుట వెఱ్ఱి. అట్టిపద్యమే ని నిర్దుష్టముగా నుండున ట్లెవ్వరిచేనైన జెప్పించుకొనక సహజముగుతముతప్పడుకవిత్వముననే యుపయోగించి 'గాండ్లు' అనునట్టిశబ్దమును బ్రయోగించి ముద్రింపించికొనుట మందబుద్ధిలక్షణము. ఆస్థానవిద్వాంసులచే నానాభంగులఁబరాభవింపఁబడి యీవలికి వచ్చి బెట్టుకొఱకిట్లుగాఁ జెప్పుకొనిరి. అంతటితో సాగక ముద్రింపించి ప్రకటించిరి.

ఈప్రకటింపుట "మేమే కవీంద్రులమంచు" అను మీసపుఁబద్యము [illegible]—

పద్యప్రాస్తవ మంతగా లేనిభాషలకు గద్యమే గొప్పదని వ్రాసిరి. ఇది ఇంగ్లీషు నుద్దేశించి వ్రాసినట్లు తోఁచుచున్నది. ఈయూహాయే సరియైనచోఁ దెలియనిభాషలనుగురించి పిచ్చివ్రాఁతలు వ్రాసి యభిజ్ఞతను బయల్పరచికొనకుఁడని హితము చెప్పుచున్నాను. ఇంగ్లీషులో స్కాటు, రస్కిన్ మొదలగు మహానుభావులురచించినగద్యము వంటిగద్యము తెలుగుభాషలోనికి వచ్చినచో వీరిదివఱకుఁ బద్దెములని పేరుపెట్టి గిల్కుచున్ననిస్సారపువ్రాఁత లడుగంటును. దేశమున కవసరమైనమార్పులు రాకమానవు. భాష యభివృద్ధిఁ జెందుచున్నప్పుడు పుర్రచేయి యడ్డముపెట్టిన నాగదు. వీరందఱుఁ బ్రేరేపించి యెన్ని యగౌరవపువ్రాఁతలు వ్రాయించినను వీరెన్నిగిల్కినను భాషయందుఁ జరగుసంస్కారములు యాఁగిపోవు. ఎన్నిదినములు వీరును వీరివంటివారునుగిల్కుచున్నబోలుపద్దెములే జనులపాలిటికవిత్వముగానుండవలెను. కుక్షింభరత్వమునకో కనిపోకయో యొకరినొకరు తిట్టుకొనినదూషణములే జనుల కామ్నాయములా? వీరిప్పుడు వ్రాసినగ్రంథములకంటె మంచిగ్రంథములు వ్రాయలేరు. వాఙ్మయవిమర్శకుఁడు వీరికిఁ దగిన స్థానమే ఇచ్చునుగాని బిరుదాములను జూచి కవిసార్వభౌము లని తలఁచఁడు.

హితకారిణి 1913 జూలై 27 తేదీ.

"అష్టావధాన కష్టావలంబన మన్న నంబికొండయదండనంబునాకు" అని చెప్పుటకూడఁ బైదానివలనేయనుటకుసందేహములేదు. అష్టావధానముకష్టావలంబనమైనదనియు నది తమకు నంబికొండయదండనంబుఁబోలె మిగులఁ జులకనైనదనియు నభిప్రాయమును వెల్లడిం

చిరి. కాని వీరు విజయనగరాదిపట్టణములలో నష్టావధానమునఁ భ్రష్టత్వ మొందినమాట జగద్విదితమే కదా? అదియట్లుండ నిన్నఁగాక మొన్న నర్సారావుపేటలో శాఖాభిమానులెన్నో యెత్తులు బెట్టి చేయించి నను నష్టావధాన మభిధానమాత్రమగునట్లుగాఁ బాడుచేసిరి. తమ రిదివఱ కష్టావధానవిషయమై వ్రాసికొనిన ప్రల్లదపుశ్లోకమందలి యు నేకాంశము లిందు లేవు. తమపాండిత్యము వెల్లడించు కావ్యోక్తి లేదు. శాస్త్రవాదము లేదు. సమస్యలు లేవు. పురాణము లేదు. చివరకు వాక్యప్రసంగముకూడ లేదు. ఇవి నామమాత్రములుగాఁ జూపెదరేమో కాని శ్రీ బెల్లముకొండ రామరాయకవీంద్రుఁడు వీరశరభావతారము వలెఁ గన్పట్టుటచే భయపడి వదలుకొనిరి. గంటలు గురికిఁ బగ్గము వారగాఁ జెప్పి తప్పిపోవుటచేతను పద్యములు మరల సరిగాఁ జదువ లేకపోవుటచేతను వ్యస్తాక్షరి మున్నగువానియందు ధారణాశక్తి యు పయోగింపకఁబోవుటచేఁతను ఒకపృచ్ఛకుఁ డడిగినప్రశ్నమునకు స రిగా జవాబుఁ జెప్పఁజాలక తబ్బిబ్బుఁ జెంది యిచ్చట సర్వజ్ఞుఁడు బ భ్రువాహనునిచే నోడిన ట్లోడితి మని ప్రార్థించుటచేతను నష్టావధాన మున వెలవెలఁబోవుటను అష్టావధానమునకు వీరు పనికిరారని ప్రాజ్ఞు లందఱు నిరసించిరి. అట్టిలోపములు వెల్లడివడకుండుటకై తిరుపతిశా స్త్రిగారియత్తగారివైపున ముఖ్యబంధువులై యసత్యములకును మాయ లకును జన్మస్థానమై కపటనాట్యమునకు వెనకనుండి 'తధోక్తం' అ ని తాళమువేయుచు మేళము సాగించు చావలి కృష్ణయ్యగారిచే సత్యే తరము లగువ్రాతలు వ్రాయించుకొనుటయే కాక శిష్యులచేత నుత్స వములచేతను దెగబొగడించుకొనిరి. ఇందువలన కష్టావధాన మపజయ ప్రదంబని యెఱుఁగనయ్యె. కావున "అష్టావధానకష్టావలంబన మన్న నంబికొండయతండనంబు మాకు" అనుపదము మార్చి "నంబికొండ

యదర్శనంబు మాకు" అని దిద్దికొనుట యుక్తము.

ఆంధ్రపత్రిక — పాణిగృహీతాశ్రవణానందశృంఖల.

తిరుపతివేంకటేశ్వరులచే రచియింపఁబడిన పాణిగృహీతాశ్రవణానందముల ప్రయోజనమును గూర్చి చాలకాలమునుండియు భిన్నాభిప్రాయము ప్రబలి యున్నది. తారాశశాంకవిజయముకంటెను దుర్నీతిదాయకములై యాంధ్రుల కవమానమును నష్టమును గలిగించుచున్న వనియు, నివి యాంగ్లేయభాషాసంపర్కముచే నాగరికత యెక్కువగుచున్నయిక్కాలమునందే విరచితము లగుట చింతనీయ మనియు, విమర్శకులు వ్రాయుచున్నారు. ఈగ్రంథమును శ్రద్ధగ బఠించువారల క్రిందలిభావనలు దుర్నీతిదూషితము లనియు, శృంగారము పేరునం దనేక యసభ్యవర్ణనలు చేయఁబడి సంసారమాధుర్యమునకు గళంకము నాపాదించుచున్న వనియు, స్ఫురింపక మానదు. ఇట్టిగ్రంథములవిమర్శకు బూని, వీనిచే నాంధ్రప్రపంచమునకు గలుగుచున్న మహోపకారమును వెల్లడిచేయగలిగినందునకు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వందనీయులు. సుబ్రహ్మణ్యముగారీగ్రంథరచయందు నిరుపమానమగు ధైర్యమునే గాక, నిష్పాక్షికబుద్ధియు, విమర్శనానిపుణత్వమును, లోకజ్ఞానమును, వెల్లడించి యున్నారు. ఈ రెండుగ్రంథములయందలియసందర్భములు, అన్వయాభాసములు, వ్యాకరణభ్రంశములు, అపార్థములు, అసభ్యములు, ఔచిత్యభంగములు, మున్నగుదోషములనెల్ల బహునేర్పుతోడను వివేకముతోడను సామర్థ్యముతోడను చర్చించి యున్నారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగా రిట్టివిమర్శగ్రంథములింకను రచియించి భాషాసేవ సేయుదురనియు భాషాభిమాను లిట్టిప్రయత్నములను బ్రోత్సహింతు రనియు, నమ్ముచున్నాము.

1913 వ సం॥ జూన్ 18 తేదీ.

అయ్యో !

వేమవరపుశతావధానముఁ గూర్చి కామేశ్వరకవిగారి లేఖ లోకవిఖ్యాత మగుమీాపత్రికయందుఁ బ్రకటింపఁబడినది మొదలు చెళ్ల పిళ్ళ వేంకటశాస్త్రిగారును, వారిపక్షమువారును జేయుచున్నయల్లరికి మితిలేకుండ నున్నది. నోటికి వచ్చినకూతలు, చేతికివచ్చిన వ్రాతలు. కామేశ్వరకవి లేనేలేఁడఁట! ఆవ్యాసమును గొప్పరపువారే వ్రాసియు న్నారఁట! మతిభ్రష్టులైనవారి కొకహద్దా? ఒకభయమా? ఒక గౌరవమా? 1913 వ సం॥ ఫిబ్రవరి 26 తేదీ—ఆంధ్రపత్రిక

నేను వేమవరావధానమునకుఁ బోయి చూచినవారలలో నొకఁడను. లక్ష్మీనరసింహకవిగారివ్యాసమునం దసత్యాంశ మేమియు లేదు......... "కసిపోనమ్మ మసిపూసికొనినట్లు పత్రికాసంపాదకులను దిట్టుటకంటె నిట్టిపాడవధాన మేల చేసితిరని తిరుపతివేంకటేశ్వర కవులనే మందలించి "తప్పిచ్చుటనో శిక్షయిచ్చుటనే" యనున్యాయము ననుసరింపుఁడు. చిత్తగింపుఁడు. ఇట్లు వేమవరాన సభాసభ్యుఁడు, పట్టెము నరసింహము. సువర్ణలేఖ 10 వ జూన్ 1913

ఆంధ్రపత్రిక.
1913 సం॥ ఏప్రిల్ 30 తేదీ.

తిరుపతివేంకటేశ్వరకవులకు ప్రత్యుత్తరము.

ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలోఁ దిరుపతివేంకటేశ్వరులు గారు వ్రాసిన "కల్లిబొల్లి" వ్యాసమును జూచితిని. వీరు శతావధాన ఫలాఫలములఁ గట్టిపెట్టి శతావధానసభ లరిష్టదాయకము లనుచున్నారని చెప్పుచు వారినిఁ దిట్టుటతోనే వ్యాస మంత సరిపుచ్చిరి అంతియకాదు. ద్రావిడప్రాణాయామమూాచరించి స్వకుచమర్దనము,

స్వాతిశయప్రకటనము కావించుకొనిరి. ఆత్మస్తుతి పరనిందయే వీరికి ప్రధానము గాని విషయము ప్రధానము గాదు. తిట్టులపంచాంగపుజన్నిగట్టు లని వీరినిగుఱించి యిదివరకే వ్రాయబడి యున్నది. "అయంపటాటోపః కౌపీనసంరక్షణార్థం" అనినట్లు వీరివ్రాత లన్ని స్వాహంకారస్వాతిశయప్రకటనమునకే యని చూచినవారెల్లఁ దెలిసికొనఁగలరు.

తిరుపతివేంకటేశ్వరులుగారికి వ్యాసములోఁ జమత్కారము చూపవలె నని కోరిక యున్నది గాని పాపము! ఛాందసము వెన్నంటియే వచ్చుచుండును. దాని కెవరేమి చేయఁగలరు.

చరికొండధర్మన్నతరువాత రామరాజభూషణాదు లిటీవల నవధానరచన గొప్పశక్తిగాఁ బరిగణించిరని వ్రాసితిరి. ఈపంక్తులు మీచరిత్రజ్ఞానమునకు దివిటీలై వెలుగుచున్నవి. కానిండు. ఛాందసమునకుఁ జరిత్రమునకుఁ జాలదూరము. వీరినన్నఁ బ్రయోజనము లేదు. అవధానములు వలదన్నను, నిస్సారపువ్రాతలకుఁ బద్దెములు వలదన్నను, సారవంతములైన గద్యములుండునన్నను, తిరుపతివేంకటేశ్వరులుగారికిఁ గంఠమువఱకు వచ్చును. ఏలయని విచారింపఁగా నిస్సారపుఁబద్దెములవలనను నిష్ప్రయోజకము లైనయవధానములవలనను సంపాదించుకొనినపేరునకు భంగము కలుగు నని భయపడుచున్నారని తెలియుచున్నది. వీరిభయమున వెఱచి దేశాభ్యుదయమునకు భాషావర్ధనమునకు వలయుమార్పులు జరుగకుండునా? ఉండవు. ఇఁకనేమిగతి? ఎవ్వరు వీరి నిష్ప్రయోజకావధానములను, స్వాతిశయప్రకటనములను, బొగడరో వారిని వీరు "యద్దినే తద్దినం నాస్తి తద్దినం దుర్దినం మమ" ఏదినమందుఁ దద్దినము లేదో యాదినము నాకు దుర్దినము" అనువిధమున దూషించుచుందురు.

కృష్ణాపత్రిక. ఏప్రిల్ 1913 సం॥రం॥

అయ్యా !

అభినవసరస్వతీ పత్రికాధిపతిగా రగుజానపాటి పట్టాభిరామశాస్త్రిగారు తిరుపతివేంకటేశ్వర పక్షపాతులై సత్యాసత్యవివేచన మించుకైన జేయక అసత్యములనే ప్రకటించుటకును నన్యుల దూషించుటకును గంకణము కట్టుకొని యుండిరి. కావున వారిపత్రికలో నీక్రింద నుదహరించు సత్యవిషయమును బ్రకటింపరని యెంచుకొని నిష్పక్షపాతబుద్ధులగు తమరు తమపత్రికలో ప్రకటింతు రనునమ్మకచే నీక్రిందియంశమును వ్రాసితిని. కావున రాబోవుతమపత్రికలో నిడిప్రకటించి సత్యమును వెలయింపం గోరెదను. వేమవరపు శతావధానములో నేనొక పృచ్ఛకుడనై.

శ్లో. యువతీయుగసంగమాత్ప్రభూతో
జనయామాస నపుంసక స్తనూజమ్.

అని యొకసమస్య చదివి వినిపించి దీనిని బూర్తి సేయుఁడని కోరితిని. అందుకు వేంకటశాస్త్రిగారు "ఇదిరేపు పూర్తిచేసి వినిపించెద" మని" చెప్పి కాకితముమీఁద వ్రాయించుకొని మఱునాఁడు తిరుపతి శాస్త్రిగా రవధానము సేయునప్పుడు శివరామశాస్త్రిగారియంగీకారము నంది "శ్లో. ఫణిభూషణ ముత్తమాంగభాస్వచ్ఛశిఖండంచ దిగంబరం శ్వవాహం" అను పూర్తితో యువతీయుగసంగమాత్ప్రభూతో జనయామాస నపుంసక స్తనూజం" అను, నేనిచ్చినదానిని గూడఁ జదివి వ్రాయించిరి. అంతట నేను దీనియర్థమును జెప్పుఁడని కోరఁగా మేమిప్పుడు చెప్పమనిరి. ఇటీవల యభినవసరస్వతీ పత్రికలో నాసమస్యయందలి "యుగ" అనుపదము దీసివేసి "జన" అను క్రొత్తపద మొకదానిని జేర్చి "యువతీజనసంగమాత్ప్రభూతో జనయా

మాస నపుంసక స్తనూజం" అని ప్రకటించిరి. ఇట్లు మార్చినవారెవ్వరో శ్రీతిరుపతివేంకటేశ్వరులో శ్రీపట్టాభిరామశాస్త్రిగారో తెలియకున్నది. సభలో నేనాసమస్య నడుగునప్పుడు తిరుపతిశాస్త్రిగారు "ఇది పూర్తిగాదు. అశక్యము" అనిరి. అందుకు నేను "ఇప్పుడన్నమాట నేవ్రాసియుందు నేను పూర్తిచేసి వినిపించెదను" అని చెప్పితిని. వెంకటశాస్త్రిగా "రింత యెందుకు. రేపుపూర్తిచేసి చెప్పెదలే? అని మఱునాడట్లే చేసిరి. ఇట్టస్థితిలో యుగశబ్దమును మార్చుటకు దగు కారణమును దెల్పుచు నాసమస్యకును దత్పూర్తికిని దగునర్థమును బత్రికాముఖముననే వివరించుటకు శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులను బ్రార్థించుచున్నాను.

ఇట్లు,

యల్లమండ, పాపరాజు వీరరాఘవకవి,
నర్సారావుపేట పోస్టు. శతావధాని.

ఆంధ్రపత్రిక.

వేమవరమునందు శ్రీతిరుపతివేంకటేశ్వరులు చేసిన శతావధానము సరిగా నెరవేరియుండలేదని యందలిదోషము లన్నిటిని వివరించుచు నొకవ్యాసము ఫిబ్రవరుమార్చినెలల మనోరంజనియందు బ్రకటింపబడినది. వేమవరపు శతావధానమును గూర్చి బాకాలూదుచున్నవా రందరు నీవ్యాసమును జదువగోరుచున్నాము. 1913 వ సం॥రం॥ మార్చి 26 తేది.

కృష్ణాపత్రిక.

కొప్పవరపు సోదరకవుల లేఖలు.

ఈజరుగఁబోవుసభలో నెవ్వరిశక్తి యధికమని సభ్యులందురో వారినొక్కరినే గౌరవించుడు. రెండవపక్షపువారిని ఓడినవారిగా

నెంచి ఇదివరకు మేము వేసినపందెమునం దేవిధమగునవమానము ఓ
డినవారి కొనర్పవలయునో అట్లొనర్తురేని ఒనర్తుము. రెండు అని
యాహ్వానపత్రికఁ బంపినచోఁ దక్షణమే వత్తుము. ఇట్లు మీచెన్న
య్యగారిచే వ్రాయింపుడు. ఊరక వారియవధానతంత్రము వారిము
ఖములను మేమచ్చటకు వచ్చిచూచుట యనవసరము. అని చెప్పి
యుంటిమి. ఫిబ్రివరి 15 తేది 1913 సం॥రం॥

ఎమ్. యన్. సుందరం బి. యే. గారు ఆంధ్రపత్రిక 12-2-13
× ✓ దేహారోగ్యము లేమి వారు ధారణపట్టక సభ వదలి అచ్చటచ్చ
ట తిరుగుట చూడరా ? ×

కుమారస్వామి శాస్త్రిలుగారిట్లు వ్రాయుచున్నారు.ఆంధ్ర
పత్రిక 1913 సం॥ మార్చి 12 తేది ఫిబ్రవరి 25 తేది సువర్ణలే
ఖలో ధీఁగఱపదగు మిత్రులుండినచోఁ గఱపుఁడని తిరుపతివేంకటే
శ్వరులు వేఁడికొనుచు తవుడుకొట్టె కోడి యని యప్రౌఢకథాకల్పన
ము చేసిరి. దీని చేసినవారు తవిటికొట్టెతో సరిపుచ్చుకొని సంతృప్తి
చెందినచో గంభీరముగా నుండియుండును. ఏడుపులో ఎడమచేయి
యనినట్లుగా తమంతటఁ దామే బయటఁబడి గద్యపద్యకవిత్వములో
నికి దిగిరి. వీరితవిటికొట్టెకథను బద్దెములను జదువఁగా నెవరినిగురించి
యో నీచదూషణము కావించినట్లగపడుచున్నది కాని యీతిరుపతి
వేంకటేశ్వరుల తెలివి తిట్లతో తెల్లవారెగదా యని చింతిల్లుచున్నా
ను. మొన్న మొన్నటిదనుక వారిని దిట్టి వీరినిదిట్టి వారిచేతఁ దిట్టు
లువడి వీరిచేతఁ దిట్టులువడి మరల నిప్పు డెవరినో తిట్టఁ బ్రారంభించి
రి. ఎవరు మంచిమంచికల్పనలు చేసి సత్కావ్యములు వ్రాయుటకు
శక్తిలేకపోయినప్పటికి నిట్టి యప్రౌఢకలహ కల్పనలు చేయుట కడు
సులభమే.

Desamatha 30th Augt. 1911. 10th Page.

మొదటిసమస్య:—

ప్రియాసుతంనో ఝజతికామతంత్రే॥

యీసమస్య నివ్వగా ఆశుగా జెప్పక కాగితముమీఁద వ్రాసి యిచ్చిరట.

అవధానమం దడిగినసమస్య 'విడిచెన్ బ్రాణము లాసతీమణి యహో పీయూషపానంబునన్.'

మ. వడిమైవచ్చి యొకండు మున్నడవిలో వ్యాఘ్రింపువక్త్రింబునన్
బడి ప్రాణంబులు బాయుచందమున విభ్రాంతాత్ము డైవానిలో
బడి యెవ్వానిని బొందరాక విరహాభ్రష్టాత్మ తుష్టింగనెన్
విడిచెన్ బ్రాణము లాసతీమణి యహో పీయూషపానంబునన్.

మ. కడుదుష్టున్ నరకాధమున్ గెలువగా గాదంచుమానార్థమై
కడకన్ గొండల గోనలందు శచిడాగన్ బోవుచో నేసుఖం
పడ నేనాటికి నైన గల్గునని సామ్రాజ్యంబుపై భర్తపై
విడిచెన్ బ్రాణము లాసతీమణి యహో పీయూషపానంబునన్.

మొదటిపద్యము అవధానమందు తిరుపతివేంకటేశ్వరులచే పూర్తి చేయబడినది. రెండవపద్యము ప్రశ్న యడిగినపృచ్ఛకునిచే పూర్తి చేయబడినది.

A. SATYANARAYANA.

---

గీరత ప్రథమభాగము వెలువడగనే కృష్ణాపత్రికలో రామకృష్ణు డు వ్రాసిన విమర్శలేశము.

ఏవంవిధగుణాభిరామంబగు నీగీరతమునందు లోకపరిత్రాణము నకై

యుత్తరములు.

కొన్ని ప్రకటింపఁబడినవి. వానిలోఁ బెక్కుజాబులు వెం. శా. గారు వారిసన్నిహితబంధువులచే వ్రాయించుకొన్నవియే. మఱికొన్ని వారిస్నేహితులు మొదలగువారిచే వ్రాయఁబడినవి. కొన్ని తమంత తామే కల్పించినవి.

(1) చక్రవర్తుల లింగమూర్తి, వెం. శా. గారిమేనల్లుఁడు.

(2) ఈసుబ్బారాయుఁడు, డిటో.

ఈకుఱ్ఱవాఁడు నిన్నటివఱకుఁ గాఁకరపర్తిలోఁ గావ్యములు చదువుకొనుచుండువాఁడు. శృంగభంగకాలమునందుఁ గాఁకరపర్తిలోనే యున్నాఁడు. తరువాత నితనిని బందరునకుఁ దీసికొని వెళ్లి వెం. శా. గారు కొప్పరపువారికలహములోనే యీతనికిఁ గోటా వేసినవారు. మేము ఏనాములో నవధానము చేయునాఁటి కీతఁడు పట్టి పసివాఁడు. బడిలో నొకటిరెండుతరగతులు చదువుచున్నాఁ డేమో? ఈతనిపేరుతో మాశతావధానము బాగున్నది గాదని వ్రాసి తమయవధానగ్రంథములో నచ్చొత్తించుకొన్నారు.

(3) చళ్ళపిళ్ళ చినవేంకటశాస్త్రి. వెం. శా. గారి పినతండ్రి కొడుకు. మేనగోడలిభర్త. ఈయన కాకరపర్తిలో జరిగిన సమాచారముఁ గనులారఁ జూచినవాఁడగుటను యథార్థపక్షపాతి యగుటను దానసత్య మాడఁజాలక చిరకాల మట్టే యూరకుండియు వెం. శా. గారికోఁతకుఁ దాళలేక తుదకు దేశమాతలో వారియభీష్టప్రకారము వ్రాసి యొడ్డెక్కించెను.

(4) మధునాపంతుల వేంకటసుబ్బారావు. ఈయన మాకును వెం. శా. గారికిని సరిపడినబంధువు. విశేషించి వేంకటరామశాస్త్రిగారికిఁ బొరుగునందుండువాఁడు. పొరుగు పచ్చ వోర్వఁదనునట్లుగా నీతంపు

పెట్టినయాయనయే యీయన,

(5) వేములనారాయణమూర్తి. వెం. శా. గారిమేనగోడలిభర్త. ఈతఁడు నాల్గేండ్లు మాయూర మాయింట నుండి నైషధాంతము నేర్చినాఁడు. అప్పుడే నాయొద్ద వసుచరిత్రములో మూఁడాశ్వాసములును జిన్నయసూరివ్యాకరణము కొంతయుఁ జదివినాఁడు. అప్పటికి చర్ల వేంకటాచలపతిశాస్త్రి రఘువంశమే చదివినాఁడు. అప్పటిస్థితినిబట్టి యతఁడు కవిత్వము నేరనివాఁడని నారాయణమూర్తి వ్రాయుట వెం. శా. గారిబంధువుగాననే కదా ?

6 చక్రవర్తులకృష్ణమూర్తి సిద్ధాంతి వెం. శా. గారి సన్నిహితుఁడు.

7 ఈవెంకటాచలము. వెం. శా. గారితోఁబుట్టువు భర్త. ఈయనజాబువల్ల నొక్క తిరుపతిశాస్త్రిగారి బంధువులే కాక, మాబంధువులందును వారిని తిరుపయ్య, యని పిలుచువాడుక కలదని విస్పష్టము.

8 భగీరథశాస్త్రిగారు సత్తములు. ఈయనయొద్ద ప్రస్తుతము వేలూరి శివరామశాస్త్రిగారు కౌముది చదువుచున్నారు. ఈయన వెం. శా. గారియొద్ద కొన్నాళ్లు సంధిపంచకమువఱకు చదివి యక్కడఁ గార్యము లేక యీశాస్త్రిగారియొద్దకు వచ్చిరి. వెం. శా. గారినిర్బంధముచేత నేమి యీనూతనశిష్యుని నిర్బంధముచేత నేమి పాపమూశాస్త్రిగారు జ్ఞాపకము,అని సందేహించుచు వారు చెప్పినట్లు వ్రాసిరి. ఈయన వింజరములో నున్నపుడు భారద్వాజఘట్టములోని వివిధవ్యాఖ్యానసందర్భములను గమనించుటకై వేంకటరామశాస్త్రిగారాయనయొద్దకు వెళ్ళినమాట నిజమే.

కాకరపఱ్ఱు.

పు. గౌరీపతిశాస్త్రిగారును, ఆ. సీతారామశాస్త్రిగారును ద్వి. బ్రహ్మానందశాస్త్రిగారును వ్రాసినది కొన్నికారణములచే యథార్థము వ్రాయఁజాలమనియే కదా? వారియభిప్రాయ మేమన? యథార్థము వ్రాసినచో వేం. శా. గారికి బాధక మనియే బ్రహ్మానందశాస్త్రిగారు వే. వేంకటసత్యనారాయణ మున్నగువిద్యార్థులు వెం. శా. గారియొద్దఁ బుస్తకములు లాగుటకై లేనిపోనియుత్తరములు వ్రాయుచున్నారని విని యాకోతిమూకమాటల నమ్మవలదని వ్రాసిరి. కాని మఱియొకటి కాదు. వారువారు వ్రాసినయుత్తరములు మాయొద్దను గలవు. మాగ్రంథములోఁ బ్రకటించెదము.

చర్ల వేంకటాచలపతిశాస్త్రి యనునతఁడు నాకు బావమఱందియే. ఈతఁడు కావ్యనాటకాలంకారములు చదివి కౌముది చదువుచుఁ గవిత్వము చెప్పుచున్నాఁడు. ఇతఁడు వ్రాసినట్లుగా వెం. శా. గారి ప్రోత్సాహముచే నచ్చటివిద్యార్థులలో నెవ్వరో వ్రాసిరి. ఈయావద్విషయము వే. వేంకటసత్యనారాయణ వ్రాసినయుత్తరముచేతనే వెల్లడి యగుచున్నది. ఈతఁడు రిజస్టరు చేసి పంపిన సత్యసందేశములో సత్సభకు సంబంధించిన విషయములు లేవని వెం శా. గారు ముద్రింపమానిరఁట! ఒకయుత్తరము వ్రాయుము వచ్చి వ్రాలెదము. అని తామాతనికి వ్రాయఁగా నాతడు రామకృష్ణకవు లిపుడీగ్రామమున తేరు వారియొద్ద కేగుఁడు మీవిడంబము నడంచెదరు. అని వ్రాయుట సత్సభకు సంబంధించినవిషయమే యని యూఢిగా నమ్మెదురుగాక! ఇంత తంపి పెట్టిన వేంకటశాస్త్రిగారి బండార మెంతో? ముందుగాఁ గృష్ణకవి తేల్చు ననియు నాపిదపఁ దిరుపతిశాస్త్రి వేంకటరామశాస్త్రులుగార్ల సంగతి చూచుకోవచ్చు ననియు నందుఁ గలదు

థము యథార్థమని ముమ్మాటికి వారు విశ్వసింతురుగాక !

శివరామశాస్త్రిప్రభృతులు కొందఱు వ్రాసినపాక్షికపువ్రాత లును, పుస్తకములఁ గోరి వ్రాసినమఱికొందరస్తుతివాక్యములును నిర థకము లయిన వని తెలిసికొనవలయును. అట్టియుత్తరములు కోటాన కోట్లు మాయొద్దను గలవు.

ఉపోద్ఘాతము.

లో మేమెన్నివిధములనైనను వారి కపయశముఁ గూర్పయ త్నించుచున్నా మనియు, మాకుఁ బ్రసక్తిలేని యితరవిషయములం దును యథార్థ మెఱింగియుఁ గలుగఁజేసికొన్నార మనియు వెం. శా. గారు వ్రాయుచున్నారు. మావిమర్శముకొఱ కంపఁబడిన పండితబ్రువ లక్షణముపై మాయభిప్రాయ మొసఁగుట తప్పా? ముఖపరిచయ ము లేని కొప్పరపువారిని వర్ణించుచు వ్రాసి యందులో మానిందఁ జేర్చి ప్రకటించుట మాకపయశముఁ గూర్చుతలంపుచేతనే గదా? అత్యద్భుతవిమర్శములో వారిని శ్లాఘించుచు మమ్ము నిందించుచు వ్రాయుట మాకేదియో తలవంపనుతలంపుచేతనే గదా? ఎవరు త్రవ్వుకొనినగోతిలో వారే పడుదురు. తుదకుఁ గొప్పరపువారు మాకు మిత్రులు వారికి శత్రులు నైరి.

దేశమాత.

శ్రీ తిరుపతివేంకటేశ్వరుల శతావధానము నరసారావుపేట తాలూకా వేమవరము అగ్రహారములో శ్రీ భాగి చెన్నయ్యగారు శ్రీతిరుపతి వేంకటేశ్వరులచే, అవధానసభ యొకటి చేయించిరి. ఈశ తావధానము రెండుదినములు 50 మందికి $12\frac{1}{2}$ గంటలు పదిరెండు గంటల నర్తకాలములో బూర్తి జేసిరి. సభారంభమునకు ముందు శ్రీ భాగి చెన్నయ్యగారును, వారి బంధువులును శ్రీ కొప్పరపు సోదరకవు

శ్రీతిరుపతివేంకటకవులకును రాజీకూర్చుటకై సభ చేయించెదము. అని వాదుకచేయుటచే, ననేకులు వచ్చిరి. 23-12-12 తేదీని శతావధానమునకై సభ యేర్పడెను. వేంకటశాస్త్రిగారు మొదటిదినము ప్రథమపాదము చెప్పిరి. ప్రథమపాదమునే చెప్పినప్పుడు పృచ్ఛకులడిగిన వృత్తములు, విషయములు తాఱుమారుచేసిరి. తిరుపతిశాస్త్రిగారు మఱునాడు మూడుపాదములు చెప్పిరి. పృచ్ఛకులను శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారును మరియిద్దరును సరిగాఁ బంక్తులుగా గూర్చుండఁబెట్టిరి. వారి కయిష్టముగాఁ గొందఱు పృచ్ఛకులుగా నతిప్రయత్నముమీఁద గూర్చుండిరి. వేంకటశాస్త్రిగారు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారి యిష్టమునుబట్టి కొందఱు పృచ్ఛకులిచ్చిన విషయములను, వృత్తములను గ్రహించుచు నెట్లో ఒకపాదము జెప్పిరి. మఱికొందరు ఇచ్చిన సమస్యలను, వృత్తములను, శబ్దములను, మీరడిగినట్లి మేము చెప్పమనియును, చెప్పలేమనియును దోసివేసిరి. కొన్ని ప్రశ్నములను విని తమ శిష్యులును, పట్టాభిరామశాస్త్రిగారును వ్రాసికొనిన తరువాత, రేపు చెప్పెదమనిరి. కొందఱు సమస్యల నిచ్చుచుండగా నవి గ్రహింపక, విసర్జించుచు, దూరమునందుండిన కొందఱిని పాతూరి పట్టాభిరామయ్యగారి, చేసన్నలచే-సమస్యలు, మీరిస్తారా; అని పిలిచి, వారిసమస్యలను తీసుకొనిరి. ఇట్లుచేయుటకు గారణము. కొందరడిగిన సమస్యలు విని, అవి తమకు, అసాధ్యములుగా దోచుటచే నివి యిప్పుడు కావు. తరువాత జెప్పెదము. "అవి ముందుగా నివ్వండి, మీరు కూర్చుండండి" అని యుక్తిచేసి వారిని వారించి, శతావధానమను పేరున నేబదిమంది పృచ్ఛకుల సంఖ్య త్వరగా ముగించుటకును, ముందడిగినవారలు—మావి చెప్ప రేమి అని అడిగినచో, సంఖ్య ముగిసెనుగదా? అని సమాధానము చెప్పుటకును,

అయియుండెను.

మతల బైవారు మా సమస్యలమాట యేమిచేసితిరనగా పై నుదాహరించినట్లు సెలవిచ్చిరి. కొందఱు సంస్కృతము తెలుగుగాను, తెలుగుసంస్కృతముగాను, మార్చి చెప్పుడని కోరినప్పుడును, కొందఱు కొన్ని శబ్దము లిచ్చి, ఇవి పాదాదులనుంచి వృత్తములు చెప్పుడని కోరినప్పుడును, కొందఱు అలంకారములను కోరినప్పుడును, ఈలాటివి మేము చెప్పము. యేర్పరచుకొనిన నియమములను దాటరాదు. అని మఱియు లోకములో సామాన్యముగా వాడబడుచున్న వృత్తములును, వర్ణనలును, మాత్రిమే కోరవలయును. ఇట్టివే చెప్పెదము. ఇతరములు చెప్పము. ఇవియే మానియమములు అనిరి. అగ్రాసనాధిపత్యమును వహించినవారును వారేర్పరచిన నియమములను దప్పి పృచ్ఛకు లెవరును ఏమియును అడుగరాదని వాక్రుచ్చిరి. అంతట బృచ్ఛకులలో గొందఱు మీ రుభయభాషాకోవిదులమనియు, ఎవ్వానిని లెక్కపెట్టక నవారణదిగ్విజయం బొనర్చినారమనియు, అసాధ్యవిచిత్రిశతావధానమును చేయగలవారమనియు, గ్రింథములయందు వ్రాసుకొని, ఇప్పుడు తద్భిన్నముగా నియమము లేర్పరచుకొనుట, మీవ్రాతలన్నియు నసత్యములేకదా అనిరి. మఱికొందఱు "దేవునైన లక్ష్య పెట్టము" అనిన తమరు సాధారణముగా సామాన్యులయిన కవులే చెప్పదగిన ఇట్టిప్రిశ్నలను మేము చెప్పజాలము. అని చెప్పుచుండుటచే దేవరవారి సామర్థ్యమందరకు దెలిసినదనిరి. అంతట వేంకటశాస్త్రిగారు లేచి "మీకందరకును నమస్కారములు, మేము మీరు కోరినట్లు చెప్పజాలము మాబుద్ధిచెడ్డది. పెద్దముండాకొడుకుల మైతిమి, మమ్మూరక ఏడిపించవద్దు. భాగి చెన్నయ్యగారు పిలుచుటచే వచ్చి వారికోరికను దీసివేయలేక యేదో వేడుకగా అవధానము చే

యుచున్నాము. క్షమింపుడు, అని బహువిధముల బ్రార్థించిరి.'' ఇంత మాత్రమునకేనా రెండుమాసము లుంచితిరి. అని యొకరనిరి. వెంటనే వేంకటశాస్త్రిగారిచే బ్రేరేపితులై కొందఱు వచ్చి అదలించి బెదరించి కూర్చుండబెట్టిరి. మఱునాడు తిరుపతిశాస్త్రిగారు తక్కిన సమాపుపాదములు చెప్పిరి. జానపాటి పట్టాభిరామశాస్త్రిగారును, పాతూరి పట్టాభిరామయ్యగారును, మరియిద్దరును తిరుపతిశాస్త్రిగారి కిరుప్రక్కలను పెద్దయక్షరములతో వ్రాయుచుండిరి. అవధానిగారికి ధారణ తప్పినపుడెల్ల పుస్తకములు చూపించుచుండిరి. అవధానమధ్యమున దిరుపతిశాస్త్రిగారి చెవిలో నప్పుడప్పుడు శివరామశాస్త్రి రేమేమో చెప్పుచుండిరి. తిరుపతిశాస్త్రిగారు చెప్పిన శబ్దములయందుండు దోషములు గ్రహించి వేంకటశాస్త్రిగారును, శివరామశాస్త్రిగారును "అదిగాదిది ఇదిగా దది" అని చర్చించుచును సవరించుచునుండిరి. ఇట్లుగాక వేంకటశాస్త్రిగారు తుమ్మెదపాటపాడుచు, అవధానిగారికి, విస్మృతిచెందిన విషయములను సమయోచితముగా నెఱింగించుచు సభలో గొందఱిని నవ్వించుచుండిరి. (తుమ్మెదపాట) మందిగలవారమే తుమ్మెద; మనకేమితక్కువే తుమ్మెద, గీతముపాడవే తుమ్మెద, సంగీతముతీయవే తుమ్మెద, కందమ్ముజూడవేతుమ్మెదా మఱి కందమ్ముజూడవే తుమ్మెదా? అని యెన్నో పదములు పాడిరి. తిరుపతిశాస్త్రిగారు నాలుగవపాదము జెప్పుచు 1, 2, 3, పాదములలో గొన్నిటిని మార్చుచు దిద్దించి క్రొత్తపదములు చేర్చుచుండిరి. అంతట నొకరిద్దరులేచి అన్యోన్య సహాయమున జేయుచున్న యీయవధానమునకు అవధానపదము తగునా? ఇదియేమి యవధాన మనిరి. అంతట నవధానులిరువురును మేముచేసే అవధాన మింతే. మాచేత నయినట్లు చేసెదము. మేమిట్లన్నామని పత్రికలలో వ్రాసుకొండి'' అనిరి. ఇట్లీయవ

ఢ్యాన కాలములో నొకవిషయము జరిగినది. శ్రీ కొప్పరపు సోదరకవుల కొఱకు శ్రీ భా॥ చెన్నయ్యగారు, తమఅన్నగారైన శ్రీరాములుగారిని బంప వారితో సోదరకవులు. సభలో గెల్పుజెందిన వారికే సన్మానము చేసెదరేని మేము వచ్చెద మనిరట. మఱల శ్రీవల్లావి సోమయాజులుగారును, మఱిఇద్దరును బోయి సభనలంకరింపుడు. అను చెన్నయ్యగారి లేఖనిచ్చి పిలిచిరట. సోదరకవులు మేము శ్రీరాములగారితో నిదివఱకే చెప్పినట్లు గెలుపుగొనిన వారికే సన్మానముఅని మీరుచెప్పెదరేని సభకు వచ్చెదము. మాకుశత్రువులైన వారిసభకు మేము ఊరక చూచుటకు రాము. అనిరట. సోమయాజులుగారు, సోదరకవులు చెప్పినమాటలే చెప్పక కొన్ని విడచియు, కొన్ని క్రొత్తవి కలిపియు, తిరుపతి వేంకటేశ్వరుల కనుకూలముగా సభయందుపన్యసించిరి. అంతట సభ్యులలో నొకరు సంగతియంతయు దెలిసినవారుకావున సోమయాజులుగారి యసత్యోక్తులు ఖండించి సభలో సత్యమును వెల్లడించిరి. ప్రెసిడెంటుగారు తిరుపతి వేంకటేశ్వరుల పక్షమున నెవ్వారేమి చెప్పుచున్నను, ఎవ్వరెట్లల్లరిసేయుచుండినను నివారింపక సోదరకవుల పక్షమున జెప్పెడువారికి దగునంతటి యవకాశమీయక సోదరకవులు వ్రాసిన జాబులనైనను జదువనీయక [illegible]రించిరి. వేంకటశాస్త్రిగారు కొప్పరపువారిమీదికి బంపుటకు మూడు బుఱ్ఱుపిట్టలను బెంచుచున్నాడ ననియెను. వెంటనే సభలో నొకరు లేచి సమస్యలు చెప్పలేక నమస్కారములు చేసిన తమరేనా కొ[illegible]వారిమీదికి పిట్టలను బంపునది. అనిరి. అంతట గొందఱావేశముఖులైరి. ఇట్టివిషయము లింకెన్నియో కలవు. విస్తరమగునని విష

రింపలేదు. అది యవధానసభయని యెవ్వరును వచింపలేదు. శాఖాభిమానమే ప్రధానమని పెట్టుకొని ఏవిధమునైనను తిరుపతి వేంకటేశ్వరులను, గౌరవింప వలయునని నిశ్చయించుకొని కూర్చిన సభయేకాని విద్యాసామర్థ్యమును జూపుటకు గాదని సభ్యులలో ననేకులు వక్కాణించిరి. నానారాజ సందర్శనము శతావధాన సారము అనుపుస్తకముల యందు వ్రాయంబడిన తిరుపతి వేంకటేశ్వరుల ప్రభావమును నమ్మి నిజముగా జాతమని వచ్చినవారందఱును వృథాయాస మందితిమనియు వీరి యవధాన రహస్యమంతయు జిదంబర రహస్యమేయనియు నెంచిరి. యథార్థముగా వీరిచరిత్రయంతయు 'ఊదబోవగా దాటనీళ్ళులేవు.' అనులోకోక్తికి నిదర్శనముగా నున్నది. వీరు తమ విరోధులను ఇంటిలో గూర్చుండి వ్రాయు పత్రికలచేతనే సాధింపదగును గాని వేఱువిధమున సాధించుటకు వలనుపడదు. అవధానపు మాటయెట్లున్నను శ్రీ భాగి చెన్నయ్యగారు అన్నదానము నిరాటంకముగా రెండుదినములు చేసిరి. కావున వారి యౌదార్యము సంస్తవనీయము. వేంకటశాస్త్రిగారు మాయవధానమున కిదియే కడసారి అన్నమాట భిన్నముకాకుండ నికముందిట్టి యాయాసమును జనులకు గలిగింపకుండుటకు బ్రార్థితులు.

గ్రామము దమ్మలపాడు.
తాలూకా సత్తెనపల్లి.
8—1—1915.

ఇట్లు సభ్యుడు,
ప్రత్తిపాటి కామేశ్వరకవి.

మనోరంజని, 15-2-1913.

# శ్రీతిరుపతివేంకటేశ్వరకవుల

## వేమవరపు శతావధానము.

---

23-12-12 తేదీని శ్రీభాగి చెన్నయ్యగారు వేమవరములో సభఁగూర్చిరి. శ్రీతిరుపతి వేంకటకవులు 23-29 తేదీలు 50 మందికి శతావధానము చేసిరి. అవధానమునకుఁ బట్టినకాలము, 12-13 గంటలు. ప్రథమదినము వేంకటశాస్త్రిగా రొక్కపాదమును ద్వితీయదినము తిరుపతిశాస్త్రిగారు మూడుపాదములును జెప్పిరి. తి. శా. ప్రథమపాదముసం దొకటి రెండు చెప్పిరి. జానపాటి పట్టాభిరామశాస్త్రిగారును శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారును మఱికొందఱును అధికసాహాయ్యము సేయుటచే నా 50 మందికైనను దిరుపతివేంకటేశ్వరు లవధానము సలుపఁగలిగిరి.

శ్రీ పాతూరి పట్టాభిరామయ్యగారు శ్రీతిరుపతి వేంకటేశ్వరులు శ్రీ కింకవిందప్రఘటాపంచాననులు వస్తున్నా రోహో యని కేకవేసి పోయినతరువాత అవధానులిరువురును సభాభవన మలంకరించి కొన్ని వినోదములను చేసిరి.

పిదప వేంకటశాస్త్రిగారు ప్రథమపాదముఁ జెప్పటకుఁబూని.—

1 పృచ్ఛకుని నీవు మంగళార్థముగా లక్ష్మీస్తుతిగాని నారాయణస్తుతిగాని కోరుకొమ్మనిరి. పృచ్ఛకుఁడు లక్ష్మీనారాయణస్తుతిగా మీ యిష్టమువచ్చిన వృత్తమును జెప్పుఁడని కోరెను. వేం॥ శా॥ "శ్రీవంతం గుణవంత ముత్తమజనై స్సంసేవ్యమానం కృపావంతం" అని చెప్పిరి.

శ్రీవేలూరి శివరామశాస్త్రిగారు శ్రీవంతమా శ్రీమంతమా అనిరి. వేం॥ శా. శ్రీమంతం అని దిద్దుకో అని దిద్దించిరి. సభ్యులలోఁ గొం దఱు మొదటనే దిద్దించుటా? అనిరి.

2 రామవిశ్వామిత్రులను గుఱించి పృచ్ఛకుఁడుకోరఁగా వేం॥ శా॥ ప్రథమచరణమును జెప్పిరి. తి॥ శా॥ నాలగవపాదములో శివరామశాస్త్రిగారి సాహాయ్య మందిరి.

3 చంద్రోదయము శిఖరిణి వే. శా. ప్రథమపాదముఁజెప్పిరి. తి. శా, 2-3 చెప్పి నాలుగవపాదమును జెప్పుచు విషయము వృత్తము విస్మృతిఁజెంది "యస్యాంభాంతి శతావధానకవితా" అని చెప్పిరి. శివరామశాస్త్రిగారును పట్టాభిరామశాస్త్రిగారును చంద్రోదయములో శతావధానముండునా అనిరి. తి. శా. "బభూవైంద్రీ దిక్ప్రభవ దసినాంద్రారుణరుచిః" అనిపూర్తి చేసి మొదటిదానిని దిద్దించిరి.

4 సభనుగూర్చి మీకిష్టమువచ్చినవృత్తముచెప్పుఁడని పృచ్ఛకుఁడు కోరెను. తి, శా. చంద్రోదయమునకు ముందు మఱపుతోఁ జెప్పిదిద్దించిన "యస్యాంభాంతి శతావధాన" అనునది చెప్పిరి. సభ్యులు పలువురు ఈకారణమున నివి పృచ్ఛకులతో ముందుచెప్పి కోరించినవి యని యనుకొనిరి.

5 బిడాలవర్ణన మందాక్రాంత కోరఁగా వేం. శా. బిడాలగుణములఁగూర్చి చెప్పిరి.

6 త్రిపురసుందరీవర్ణన, స్రగ్ధర. తిరుపతిశాస్త్రిగారు మూడవ పాదము "సింహాంగాంధోగ్ర రహం" అని చెప్పిరి. శివరామశాస్త్రిగారు రంహ అనునది సకారాంతమండి అనెను. తి. శా. సింహోగాథోగ్ర రంహా అని దిద్దించిరి.

7 పృచ్ఛకుఁడు జలోద్ధతగతి లక్ష్మీస్తుతినిఁగోరఁగా వేంకటశాస్త్రి గారు రథోద్ధతమును జెప్పుచుండిరి. పృచ్ఛకుఁడు జలోద్ధతగతి యిది గాదేయనగా, పట్టాభిరామశాస్త్రిగారు సద్దుపాటుచేసిరి.

8 లక్ష్మీగణపతివర్ణనము మత్తేభము కోరఁగా తి. శా. రెండవపాదమునందు యతిభంగముగాఁ జెప్పిరి. వెం. శా. "యతిని చూప కోయి అనఁగా తి. శా. మార్చుకొనిరి.

9 గాయత్రీ మహత్తు మహాస్రగ్ధరను కోరఁగా తృతీయపాదము తి. శా. చెప్పుచు గణభంగముఁ జేసిరి. వెం. శా. అందించిరి.

10 కరిని మకరి పట్టునప్పటి సరోవరవర్ణనము అన్నిపాదములు సరిగాఁ జెప్పిరి.

11 శ్రీరాముఁడు లంకకేగునప్పుడు సముద్రము దాఁటుటను ఒకపృచ్ఛకుఁడు కోరఁగా వెం. శా. "ఇట్లా ఎక్కడన్నా వున్నదా, చెప్పవచ్చునా" అనిరి. తి. శా. "చెప్పవోయి" అనిరి. వెం. శా. చెప్పిరి.

12 ప్రియావిరహ మొందిన పురుషుని మనస్సు మహాస్రగ్ధర. ఇందు రెండవపాదము విశ్రమము చెడిపోయినది. పట్టాభిరామశాస్త్రి గారు "మళ్ళీచూచి చెప్పండి అని పుస్తకమును చూపించిరి. తి. శా. దిద్ది సరిగాఁ జెప్పిరి.

13 చీకుముల్లుసీసము. వెం. శా. ప్రథమ పాదమును సీ. "నిన్ను గాల్చినఁగాని నీబుద్ధి మానవే నిన్నేమ నందునే చీకుముల్లు" అని చెప్పిరి. తిరుపతి శాస్త్రిగారు, ఛీ ఛీ అనఁగా వెంకటశాస్త్రిగారు ఛీ తేమనందునే చీకుముల్ల, అని దిద్దించిరి. తిరుపతిశాస్త్రిగారు మూడవపాదమును వేరువృత్తముగాఁ జెప్పఁగా శివరామశాస్త్రిగారు సీసము

అని పెద్దఁగాఁ జెప్పిరి. సభ్యులలో నొకరు లేచి యిట్లొకరికొకరు చెప్పు కొనవచ్చునా, అనఁగా వెం. శా. గురుశిష్య న్యాయములోఁ జెప్పు కొనినను దప్పులేదనిరి.

14 పృచ్ఛ. సూర్యోదయాభివర్ణనము మీయిష్టము వచ్చిన వృత్తము చెప్పుఁడనఁగా వెం. శా. శార్దూలమును జెప్పిరి. తి. శా. సరసముగాఁ బూర్తి చేసిరి. ఇది తిరుపతి శాస్త్రిగారు గుంటూరులోఁ జదువగా విన్నారమని కొందరు చెప్పిరి.

15 పృచ్ఛకుఁడు తిరుపతి వేంకటేశ్వర వర్ణన, మత్తకోకిల కోరఁగా మత్తేభము వ్రాసికొమ్మని వెం. శా. మత్తేభముఁ జెప్పిరి. తి. శా. దాని నాల్గవపాదము పాతూరి పట్టాభిరామయ్యగారి బుక్కుఁ జూచి చెప్పిరి.

16 లక్ష్మీసరస్వతులు మానినీవృత్తము. తిరుపతిశాస్త్రిగారు నాలుగవపాదము రెండుమూడుసారులు వ్రాయించి దిద్దించి మార్చుచు జెప్పిరి.

17 పృచ్ఛకుఁడు మల్లెమొగ్గమీఁద సీసమును జెప్పుఁడనికోరగా వెంకటశాస్త్రిగారు సీసము అవధానములలోఁ జెప్పరాదు, అదిపెద్దపద్యము మత్తేభమును వ్రాసికో అనిరి. వెం. శా. మత్తేభమును జెప్పగా పృచ్ఛకుఁడు వ్రాసికొనెను. పృచ్ఛకుని కాగితముమీఁద మత్తేభము వ్రాసియుండెను. కోరుట సీసము వెం. శా. చెప్పినది మత్తేభము. తిరుపతిశాస్త్రిగారు, 3వ పాదమును కఠిని మకరిపట్టి నప్పటిసరోవర వర్ణనపుఁ జరణముగాఁ జెప్పుచు వృత్తమును మాత్రము మఱవక విషయమును మఱచి చెప్పుచుండగా వెంకటశాస్త్రిగారు తుమ్మెదపాటనుబాడి మల్లెస్ఫురణకుఁ దెచ్చిరి. తుమ్మెదపాట "మందిగలవారమే తుమ్మెదా, మనకేమితక్కువే తుమ్మెదా, మల్లెపైవ్రాలవే తుమ్మె

డా, మొల్లపై వ్రాలవే తుమ్మెదా" అని పాడిరి. తిరుపతిశాస్త్రిగారు గ్రహించి సరిగాఁ జెప్పిరి. ఇందే రెండవ పాదములో పూబోండ్లు అనుపదమును ప్రథమపాదములోఁ జెప్పినదే చేయుగా వే. శా. పూబంబోండ్లు అనుమనిరి.

18 అవధానుల బాల్యవర్ణనము, ఉత్పలమాల. ఇందు వే. శా. మాటిమాటికి మఱచుట, శివరామ శాస్త్రిగారు పట్టాభిరామ శాస్త్రి గారు తెలుపుట, సభ్యులు విచారించుట కల్గెను.

19 వృ. తల్లిచచ్చిన కుమారునిగూర్చి ఉత్పలమాలకోరఁగా వెం. శా. "అమ్మరో చచ్చిపోతివటె బువ్వను బెట్టను నాదలెవ్వరే" అనియేడుపు నభినయించుచు పెద్దగా శోకరసముతోఁ జెప్పిరి. తిరుపతిశాస్త్రిగారు "ఏడిచినట్లే ఉన్నదితే" అనిరి. వేంకటశాస్త్రిగారు మఱల అమ్మరో చచ్చిపోతివటె అన్నము నెవ్వరు పెట్టువారే తా। అని దిద్దిరి. తి. శా. రెండవపాదమును జెప్పుచు, ప్రథమపాదము చివరతా దిద్దించి నా యమ్మరో అని చెప్పిరి.

20 వృ॥ పార్వతీ పరమేశ్వర వర్ణనము లయగ్రాహిని గోరెను. తి. శా. మూడవపాదము నడకతప్పిరి. వెం. శా. నన్నననన్నననన న్ననన, అని గుంటూరులో వేలూరి శివరామశాస్త్రిగారికి తక్కతక తక్కతక తక్కతక అని చెప్పినట్లే చెప్పిరి. ఇట్లు చెప్పుట సభ్యుల కసమ్మతమగుటచే కొందఱు లేచి అన్యోన్య సహాయము మంచిపని కాదని అనేకవిధములఁ గఠినముగా ననిరి.

21 సరస్వతి, తోటకము. నిరాఘాటముగాఁ బూర్తి చేసిరి.

22 ఈశ్వరస్తవము, మందాక్రాంత. ఇది అక్కడక్కడ పట్టాభిరామశాస్త్రిగారి పుస్తకమును జూచుచుఁ బూర్తి చేసిరి.

23 స్త్రీవర్ణన, కందము. వేంకటశాస్త్రిగారు ప్రథమ పాదముఁ

జెప్పిరి. తిరుపతిశాస్త్రిగారు రెండవపాదమునకువచ్చి మఱచిపోయిరి. వెం. శా. తుమ్మెదపాట మొదలుపెట్టి "కుందమ్ముచూడవే తుమ్మెదా మఱి, [illegible]చూడవే [illegible]దా!" అనిపాడిరి.

24 [illegible] [illegible]ర్ణనము [illegible]యు స్త్రీవర్ణ[illegible]ము [illegible] [illegible]చ్చిన వృత్తములోఁ జెప్పుఁడని పృచ్ఛకుఁడు కో[illegible]. వె[illegible]స్త్రిగారు సీసము వ్రాసికొన్నారు. [illegible]తట సభలోనుండి యొకరులేచి సీసము అవధానమునందుఁ జెప్పరాదనియు పెద్దదనియు నిదివఱకుఁజెప్పితిరే, ఇప్పుడు దీనికి సీసము చెప్పెద మనుటేల అనిరి. వెం. శా. వర్ణనకు సీసపద్యము బాగుగానుండును అనిరి. లేచి అడిగినవారితో పట్టాభిరామశాస్త్రిగారు మీకేమి పట్టినది, మీరుకూర్చోండి అనిరి. సభ్యులలో నొకరిద్దఱు మీయిష్టమువచ్చినదే చెప్పండి: వారి పేరి మాటెందుకు అనిరి. వెం. శా. సీసము చెప్పిరి. తిరుపతిశాస్త్రిగారు పూర్తి చేసిరి. నాలుగవపాదమును వెంకటశాస్త్రిగా రందించిరి. తిరుపతిశాస్త్రిగారు ఫరవాలేదు లేవోయి అనిరి.

25 ఆంధ్రభాష, గీతము. వెంకటశాస్త్రిగారు ప్రథమపాదము జెప్పిరి. తిరుపతిశాస్త్రిగారు మూడవపాదము చెప్పునప్పుడు మఱచిపోయిరి. దానిని వెం. శా. "గీతమ్ముపాడవే తుమ్మెదా, సంగీతమ్మాత్రీయవేతుమ్మెదా" అని తుమ్మెదపాట పాడిరి. తి. శా. పూర్తి చేసిరి.

26 రక్త స్త్రీని విరక్త పురుషుని గూర్చి మీయిష్టమువచ్చిన పద్యమును జెప్పుడని పృచ్ఛకుఁడు కోరఁగా సీసపద్యము తిరుపతిశాస్త్రిగారు జెప్పిరి. ఇందు మూడవచరణమునందు యతితప్పిరి. నాలుగవపాదము మఱచిపోయిరి. శివరామశాస్త్రిగారు చెప్పిరి.

27 పృచ్ఛకుఁడు [illegible]జమూడి విష్ణురమను సామెత వచ్చునట్లు ఉత్పలమాలఁ జెప్పుఁడనగా వేం. శా. "ఉర్వర నెట్టిమాటయిన"

అని కొంతవఱకుఁజెప్పి అది కొట్టివేయించి "స్త్రీలకు భర్త లేనితరి జెల్లెడి దొండొక సంజ్ఞ" అని చెప్పి వ్రాయించిరి. అంతట శివరామశాస్త్రిగారు మొదటిదేల కొట్టివేయించిరి అనగా వేం. శా. ర్వ వ్రాసినారు అనిరి. తిరుపతిశాస్త్రిగారు మంచిపనేచేశావులే అనిరి. ఆపద్యములో ఆసామెత పడనే లేదు.

28 చంద్రోదయమునకుఁ బద్మము వికసింపవలెను, చంపకమాల అని పృచ్ఛకుఁడు కోరెను. వేం. శా. ఒక్కచరణము జెప్పిరి తి. శా. మూఁడుచరణములుచెప్పిరి. కాని పృచ్ఛకుఁడు కోరినదిమాత్రము కాదు. 27 పృచ్ఛకుఁడు కోరిన "నిజమాడిన నిష్ఠురమన్న వాక్యము" అని నాల్గవ పాదమునందువేసిరి. ఒకరులేచి కోరినదొకటి మీరు చెప్పిన దొకటి యిదేమి అనఁగా, దానికి సమాధానము చెప్పలేదు కాని, పట్టాభిరామశాస్త్రిగారు మీకెందుకు అని అడిగి వారిని గూర్చుండబెట్టిరి. ఈపద్యమునంతు ౭ శబ్దములు చెప్పి వ్రాయించి మరల రెండుమూఁడుతడవలు కొట్టివేయించిరి. ఇందొక పాదము విశ్రమము తప్పినది. ఒకపాదమునఁ బ్రాసము తప్పినది. పట్టాభిరామశాస్త్రిగారీపద్యమునకు సంబంధించినవి, అన్నియుజెప్పి, తిరుపతిశాస్త్రిగారికి సహాయము చేసిరి.

29 సంధ్యారాగము, శిఖరిణి, గ్లాసులైటు పేరు వచ్చునట్లు పృచ్ఛకుఁడు కోరినది రాలేదు.

30 బ్రహ్మనుగూర్చి సిద్ధి అయిన వాని మనస్సు. వృత్తమువిూయిష్టము అని పృచ్ఛకుఁడు కోరెను. దానిని నిరాటంకముగాఁ జెప్పిరి.

31 దశావతారములు, సీసము నొకపృచ్ఛకుఁడు కోరెను. వేం. శా. ప్రథమ పాదమును జెప్పిరి. తి. శా. మూఁడవపాదమును "వడుగయి యాచించె బలిరాక్షసు నొకండు, రాముఁడై త్రుంచెను రావణు

నొక॥ డని చెప్పిరి. పట్టాభిరామశాస్త్రిగారు, క్రమము తప్పినది అన గా వెం. శా. మఱచి పోయినాఁడేమో లెండి అనిరి. తి. శా. నాకు దశావతారములు బాగా తెలియవు ఒక్కసారి ఆశ్లోకము చదువండి అనిరి. పట్టాభిరామశాస్త్రిగారు చదివిరి. తిరుపతిశాస్త్రిగారు మరలనా పదమును గొట్టివేయించి "రాముఁడై త్రుంచెను రాజుల నొకఁ॥" డని వ్రాయించిరి. పదములో యశోదకు అని చెప్పి అదికొట్టివేయించి దేవకికి అని మఱలఁ జెప్పిరి.

32 రాముని పట్టాభిషేకమును ఉత్పలమాల చెప్పుఁడని పృచ్ఛకుఁడు కోరగా తిరుపతి శాస్త్రిగారు చం. హనుమ పదాబ్జ సన్నిధిని సాంజలియై నిలువన్ విభీషణుండును అని చంపకమాల ప్రథమచరణమును జెప్పిరి. పట్టాభిరామయ్యగారు కోరినది ఉత్పలమాలండి అనిరి. పృచ్ఛకుడు "చంపకమే చెప్పండి అనెను. వెంకటశాస్త్రిగారు, ఏదో అయిపోయింది దీనికికూడా గోలకావలెనా అనిరి. తిరుపతి శాస్త్రిగారే తక్కిన మూఁడుపాదములను చంపకములోఁ జెప్పిరి.

33 ద్రోణుని మరణము ఉత్సాహ. వెం. శా. ప్రథమచరణమును జెప్పిరి. తిరుపతి శాస్త్రిగారు మఱచిపోయిరి. వేంకటశాస్త్రిగారు ప్రక్కనే యుండిన శివరామశాస్త్రిగారు వ్రాయుచున్న పుస్తకమును జూచి తుమ్మెదపాటతో "చుట్టాలు పక్కాలు తుమ్మెదా! చుట్టుకొని యున్నారు తుమ్మెదా! ఉత్సాహమొందవే తుమ్మెదా! ప్రోత్సాహపఱుపవే తుమ్మెదా!" అనిచెప్పిరి.

**34** భీష్మజననము, భుజంగ ప్రయాతమును పృచ్ఛకుఁడు కోరఁగా వెం. శా. వేఱువృత్తమును మొదలిడిరి. తి. శా. సరిత్తశ్చ అనివేసుకో అనిరి. సరిత్తశ్చక్రేశం అని వెంకట శాస్త్రిగారు చెప్పిరి. నాల్గవపదమును తి. శా. వృత్తమును మార్చిరి. శివరామశాస్త్రిగారు 'మా

రినట్లున్నదండో" అనిరి. వెంకటశాస్త్రిగారు సవరించిరి. (స శేషము.)

లక్ష్మీనరసాపురములో శ్రీరాజా రావు చెల్లాయమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తిమహోత్సవ సమయమునందు ది 7—11—14 తేదీని మధ్యాహ్నము 12 గంటలు మొదలు 5 గంటలవరకు తి. వే. శతావధానమునకుఁ గాలము నిర్ణయింపబడినది. కాని ఏకారణముననో 2 గంటల కవధానము ప్రారంభింపఁబడినది. మొదట వేంకటశాస్త్రిగారు తమసరస్వతిని దిరుపతిశాస్త్రిగారికి విడిచి తామస్త్రసన్న్యాసము చేసితి మరియు ఇంతటినుండి తిరుపతిశాస్త్రిగారే యవధానకార్యములను నెరవేర్చుచుందురనియు వార్ధకముచే తామింక నీపని వదలుకొంటిమనియు ఈనాఁడు తమకు జ్వరముగా నున్నదనియు సభాసదులకుఁ దెలియఁజేయుచుఁ గొన్నిపద్యములను జదివిరి. ఈధోరణి యింతకుఁ బూర్వమే 5, 6, అవధానములలో నాందిగా నుపయోగింపఁబడుచు వచ్చినదియే. అవధానమున నేలోపము వచ్చినను గప్పుకొనుటకు ముందీప్రస్తావన యీయనచే ననేకపర్యాయములు చేయఁబడినది. ప్రత్యవధానమునకు నీయనకు జ్వరముకూడ వచ్చుచుండుట యాచారము గాఁబోలును. తిరుపతిశాస్త్రిగారును వేంకటశాస్త్రిగారును ఇంచుమించుగా సమానవయస్కు లని చెప్పుదురు. హెచ్చుతగ్గున్నను స్వల్పము గాని విశేషము గాదు. అట్టిస్థితిలో వేంకటశాస్త్రిగారు తాము వార్ధకము నోటిలోఁ బడిపోవుచున్నట్లు మాటిమాటికి నిట్లు చెప్పుచుండుట హాస్యాస్పదము. తాము వదలినసరస్వతిని వహించుటకుఁ దిరుపతిశాస్త్రిగారు పదియాఱేండ్ల బాలకుమారుఁడా యేమి?

కట్టకడకు ఏబదిమందికిఁ జెప్పుటకు నిర్ధారణచేయఁబడినది. వేంకటశాస్త్రిగారు మొదటిపాదము నెట్లో చెప్పిరి. రెండవపాదమును జెప్పుటకుఁ దిరుపతిశాస్త్రిగారు నడ్డిగట్టిరి. కాని యీయనకుఁ జెక్క

చోట్ల వేంకటశాస్త్రిగారు చెప్పినపాదములు విషయములును వృత్తములును మఱపునకు రాఁగా వేంకటశాస్త్రిగారును శివరామశాస్త్రిగారును జ్ఞప్తికిఁ దెచ్చుచు వచ్చిరి.

తుద కెన్నో సాయంకాలము సుమారు 5 గంటలకు తిరుపతిశాస్త్రిగారు రెండవపాదముఁ జెప్పిరి. ఈయన యింకను గొంతవఱకు రెండవపాదమును జెప్పకమునుపే వేంకటశాస్త్రిగారు సభను విడిచి వెడలిపోయిరి. ఆయన చెప్పినపాదముల నీయన వినకక్కఱ ఆక్షేపము కాఁబోలును.

మఱుసటినాఁడు వేంకటశాస్త్రిగారు మూఁడవపాదముఁ జెప్పఁదలఁచుకొన్నాము గాని యట్లు జరుగలేదు. తమకు శరీరములో నస్వస్థతగా నున్నట్లు వంకఁబెట్టి యాయన తప్పుకొనిరి. మొదటిరోజున చెప్పిన 1, 2 పాదము లీయన బొత్తిగా మఱచిపోయినట్లు తోఁచుచున్నది. తరువాత వేంకటశాస్త్రిగారికి మాఱుగా వే. శివరామశాస్త్రిగారు మూఁడవపాదముఁ జెప్పఁదొడఁగిరి. ఈయన మూఁడవపాదము నొకపృచ్ఛకునకుఁ జెప్పుటయు నావెంటనే తి. శా. గారు నాల్గవపాదమును జెప్పి యాపద్యము నప్పుడే చదివివేయుచువచ్చిరి. ఈచెప్పుటలో శివరామశాస్త్రిగారును తి. శా. గారును తప్పిపోయిన విషయములు పెక్కులు గలవు. వేమవరశతావధానమునందువలెనే యిందును పృచ్ఛకులను గద్దిగించి యథేష్టముగాఁ జెప్పుట మున్నగునభావచేష్టలు జరిగినవి. ఇంకొకచిత్రము. మొట్టమొదటనే యొకరు కాళీవర్ణనము నార్యతోఁ జెప్పుఁడని కోరఁగా వేంకటశాస్త్రిగారు. "ధ్యాయేపరాంబికాంతాం, అని ప్రారంభించిరి. అది విని అల్లమురాజురంగశాయికవిగారు ధ్యాయే అని యుండదనియు ధ్యైధాతువు పరస్మైపద మనియుఁ జెప్పగా నప్పుడు వారిలో నొకరు ధ్యాయేత్తని సవరించిరి. ఇది

"శ్రీమంతరి గుణవంత" యను దానికిఁ జెల్లెలో యక్కయో కావచ్చును, ఇచట నొకవిషయము చెప్పఁదగినది. షష్టిపూర్త్యుత్సవమును జేయువేళలలోఁ బ్రముఖులు కొందఱు తి. వేం. కవులపక్షము వారయి వారికి శతావధానమును జేయ నేర్పఱిచి యష్టావధానమును జేయరండని రామకృష్ణకవులను బిలువ వచ్చిరి. రామకృష్ణకవు లాసమాచారము నెఱింగినవారయ్యు శ్రీ చెల్లాయమ్మరావుగారియందలి గౌరవాతిశయముచే నాసభకు వెళ్ళ నొప్పిరి. అది యెట్లన, రామకృష్ణకవులు తమ్ముఁ ది. వేం. కవులు నిందించినచో సైఁపనోపుదురు గాని తమప్రభువును నిందించుచుండ విని యాదూషకులమానముఁ గొల్లపెట్టక యూరకుండువారు గారు. ఇట్టిచోఁ ది. వేం. కవు లేదేని సందర్భమును గల్పించుకొని తమప్రభువును నిందించుస్వభావము గలవారగుటచే నక్కడఁ గలహము తప్పక రాఁగలయది యని తలంచి యట్టి యుత్సవము నిట్టికలహముచే వికలపఱుచుట భావ్యముగాదని యెంచి రామకృష్ణకవు లాసభకుఁ బోరైరి. దీనిని ది. వెం. కవులు తమగీరత భాగములో నన్యథా వర్ణించుకొన్నను యాథార్థ్యము లోకమునకుఁ దెలియనిదిగాదు.

ఇది శ్రీరామకృష్ణభారతమున కుపోద్ఘాతము.

ఓంతత్సత్ ఓంశాంతిః శాంతిః శాంతిః



# శైష్యోపాధ్యాయిక.

---

ఉ. గీరతనామధేయమునఁ ♦ గృత్రిమపుస్తకమొం డొనర్చి స
ద్వారముఁ గేలిసేయఁ దలఁ ♦ పా? పలుపాటులఁబడ్డవాఁడ; వా
ఖోరణి గ్రామ్యమార్గమును ♦ ద్రొక్కెడుఁజూడుము గ్రాంథికాంశముల్
నేరినవాఁడవే యవుదు ♦ లే! బళిరా! శివరామదేశికా. 1

చ. ఇదివఱ కేమొ గొందఱకు ♦ నెట్టివొ నీతులఁ జెప్పి నిన్నుబో
లెఁ దనరఁజేసినాఁడవు బ ♦ ళీ! యిఁక విద్యలనేర్పు సద్గురుల్
వదలి గురుండుగాని నిను ♦ వంటిమహాత్ము గురుండటంచుఁ జె
ప్పఁదగునటంచు గీరతముఁ ♦ బల్కి కృతార్థతముండ వైతివా. 2

ఉ. ఆకిరిపల్లిలోన మఱి ♦ యన్యపదమ్ములయందు విద్దెలన్
జేకొనినన్ ద్వదీయమగు ♦ శిష్యత గౌరవహేతువంచు నే
మో కొనియెన్ గృతిక్రియల ♦ ముద్దులశిష్యుఁడు, గీరతస్థ నీ
త్యాకలనమ్ము గల్గియెసు ♦ మా! యిటు కష్టఫలమ్ము నొందితో. 3

ఉ. నీకృతిజాతనీతిని గ ♦ ణించియె శిష్యుఁడు వ్రాసినట్టిగ్రం
థాకృతిఁ జూచి సంతసిలి ♦ యట్టిసుబుద్ధివిశేషకారణం
బౌకవివీవెగాన గురుఁ ♦ డంచు నతండు వచించుఁ గావునన్
నీకిదె నేను వ్రాయుకృతి ♦ నిన్వినుతున్ శివరామదేశికా. 4

ఉ. నీవెటు గీరతమ్మనెడు ♦ నింద్యము దుష్టము రమ్యయోచనా
భావసుసూచకమ్ము సమ ♦ పాస్తచమత్కృతియ మైననామమున్
వావిడి పల్కితో యటుల ♦ పల్కినగ్రంథముఁ దాలుకుట్టనా
హ్వావహాముంగనుంగొనిన ♦ నద్భుతమా శివరామదేశికా. 5

క. తనువినియె రామకృష్ణులు
తనసత్త్వ నెఱింగిరనుచుఁ ♦ దానేమో వా
రిని దూషణఁ జేయుతలం
పున వ్రాసెదుఁ దన్నెఱుంగఁ ♦ బోలునెటు ఖళీ. 6

ఓయీ! శివరామశాస్త్రీ!

చ. చెళపిళ వేంకటేశ్వరుని ♦ శిష్యుఁడ వాకిరిపల్లెలోన వి
ద్యలఁ బఠియించినన్; శతవ ♦ ధానివి గుంటురిలోన; సద్గుణా
లి లవము భేదమన్న దెటు ♦ లేమగణింపఁగ వేంకటేశ్వరా
ర్యులకును నీకు నిన్నెటులె ♦ ఱుంగఁగఁబోలెదుఁ బండితాళికిన్. 7

క. తనసత్త్వఁట వారలు తను
వినుకలినే యెఱిఁగిరంట ♦ వెఱ్ఱి యఁట మహా
ఘనుఁడ వీఁక నూరకుండుము
కనుఁగొంటిమి నీదుగుణము ♦ కార్లనియెదవే. 8

క. కన నిరపరాధియఁట ద
న్ను నిరపరాధముగ నింద ♦ నుం బొనరిచి రం
టనయము బిడాలకృతికృ
త్త్వ నెవరో తానుగాక ♦ యన్యుం డెవఁడో. 9

ఉ. అందము చందముం గనక ♦ యాడినమాటల నర్థముల్ పసం
దొందక ముఖ్యమౌవిషయ ♦ మొక్కటియేనియు లేక యెందునుం
బొందక ముందువెన్క సరి ♦ పుచ్చు కొఱుంగనితాలుకుట్టనం
బుం దలఁపం ద్వదీయమగు ♦ మూర్ఖత మాకెఱుఁగంగవచ్చెడున్.

సీ. తనసూచనను చెలం ♦ గినరీతిగా గ్రంథ
మును రచించుట తన ♦ పనియె కాని
యెడల దేశముల నె ♦ ల్లెడ శివరామశా

స్త్రీరచించె నోతుమూ ♦ర్తి కథయనుచుఁ
దిరుపతివేంకటే ♦ శ్వరకృతప్రకటన
మౌన కేల సమ్మతిం ♦ పను వలసెను
గురుఁడౌటఁ బ్రకటించు ♦ కొననిమ్ము నష్టమే
మనుకొంటి శేమొ యీ ♦ పనికినొప్పి
కొనుట గురుఁడగుఁగాక త ♦ ప్పని యెఱుఁగవా
గురుఁడటంటివి వేంకటే ♦ శ్వరుని నెవరి
యొద్దఁజదివితివో జ్ఞప్తి ♦ యుంచవలదె
విద్దనేర్పినగురువును ♦ వీడఁదగునె. 11

క. ఓనమలుఁ జెప్పినను గురు
వే నాఁ డెపుడేమొ కొంచె ♦ మెఱిఁగింప గురుం
డేని జదువుఁ గష్టమ్ముల
నేని విడక చెప్పుగురువు ♦ నేమనవలయున్. 12

శా. మేలా నాలుగుపిప్పిముక్కలను నే♦మిత్ర నేర్చి యెవ్వారిపైఁ
గాలుంద్రవ్వఁగ; నీతి యింత వలదా♦ కయ్యంబు వియ్యంబెయం
చీలాగంటివి నీవుగాక మఱి యి ♦ ట్లీరీతివా రెవ్వరు
న్నా రీఫక్కిన నీవచఃకృతి నెటో ♦ న్యాయమ్ము వల్కంబలెన్. 13

చ. ఖలపరితోషకారణము ♦ కన్నును మిన్ను నెఱుంగరానిరీ
తుల నెఱిగింపఁజేయు నది ♦ దోషముఖమ్మును నిర్మలాంశస
త్కలకరదూరతఃకృతము ♦ ధ్వాంత మనందగు నీదుగ్రంథమ
వ్వలహృదయాంధతన్ దెలుపఁ♦బాయఁగఁజేయఁదలంచుటొప్పదే.

శా. ముందున్ వెన్కను యోజనల్ విడిచియో♦ప్పొందప్పుయోచింపకే
మందున్నొ పురచించినట్టికృతి వ ♦ హ్వా యేమివారించి తీ
సందర్భమ్ములు చాలుఁజాలు మనసా?♦నయ్యాట సింగాలతో

ముందే యిట్లు చరింప యుక్తమగునే ♦ మూర్ఖత్వముఁ మానుమీ.

చ. అటనటఁ బత్త్రికాపఠను ♦ లందఱు వ్రాసినవారితలందు నొ
క్కటి లిఖియింపఁగాఁబడినఁ ♦ గాంచి విచారణ లేక వ్రాసినా
రిట నని వ్రాయువ్రాఁతఁ గని ♦ యీయవిచారణమూలవాక్యసం
ఘటితముఁ జిత్తపొత్తము వి ♦ గర్హణఁ జేయఁ దలంపుపుట్టెడున్.

ఉ. కావునఁ బత్త్రికావళి వి ♦ గర్హితమో యటు కాదొ నీవు సం
భావన సేసి చూడకయ ♦ వారు విచారణఁ జేసి వ్రాయలే
దీవిధి దుష్టమంచనెద ♦ వింకొకపత్త్రికఁ జూడు "దేశమాతా
వదతిశ్రుతంబు తమి ♦ దగమ్మని నమ్మఁగరాదొ దానికిన్. 17

శా. ఆకాలమ్మున నన్నిపత్త్రికలయం ♦ దన్నింట నట్లుంట నం
దాకాలమ్మున నట్లువ్రాయఁబడెన ♦ ష్టాయాంధ్రపంచాస్యలే
ఖ్యాకారమ్మును జూడ భావ మెటుచా ♦ య న్వర్తిలం జాలునో
యాకాసంతయు నెవ్వరైన ఋతత ♦ త్త్వార్థుల్వచింపన్వలెన్. 18

క. ఇవి యన్ని యేల యొకభా
ర్గవరపుశ్రీరామశాస్త్రి ♦ గారికి నాతం
డువిలిఖియించినజాబును
వివేకివై జదువుమా! య ♦ వేవిడుశంకల్. 19

ఆది యట్లుండనిమ్ము.

చ. సరళపథమ్మునందు సర ♦ సంబగుభావములం బసందు నె
ల్లరకును విందుసేసి సభ ♦ లం దగుకీర్తుల నొందివందనం
బులఁ జెలువొందుసత్కవితఁ ♦ బొందుకవీశులయందు దూషణం
బుల ననువొందునట్లుగను ♦ బూన్చెడుమందునిచంద మెందుకో. 20

సీ. వారిపద్దెములఁ జూ ♦ పంబడినట్టిదో
షమ్ముల ఖండించి ♦ పిమ్మట లిరు

# శైష్యోపాధ్యాయిక.

పతిశాస్త్రికృతమైన ♦ పద్యమ్మునకు విమ
ర్శముఁ జేసిరింతియు ♦ దమదుపద్య
మందలిదోషమ్ము ♦ నందుసమాధాన
మును విడివ్రాయలే ♦ దనువుగాని
ప్రత్యుత్తరమ్మును ♦ ప్రకటింపలేదు శే
షప్రయోగమున సం ♦ పాదితమగు
దోషమెచ్చట దేవతా ♦ స్తుతిని వోయె
బాణకాదంబరికి ముందు ♦ బ్రహ్మముఖసు
రస్తవములేదె దోషమ్ము ♦ పాస్తమయ్యె
నొక్కొ? కట్టియె కుడిపిపో ♦ దొక్కొ ఫలము.

క. శ్రీముఖవాచకవచనము
లేమైన న్మొదట నుండె ♦ నేనియు దోషో
ద్దామత్వభంజకమ్మని
యామహితుం డప్పకవిస ♦ హో యనలేదో.

గీ. అగ్నిబీజమ్ము రేఫ తా ♦ నయిన నేమి
యనెడు పద్యమ్ము నిర్మూల ♦ మయ్యెఁ జేత
గానిదాని సమర్థింపఁ ♦ గడఁగుటేల
వెనుక నొకపరి యిట్టులే ♦ యనితివోకట.

సీ. కంటిచే వీక్షింపఁ ♦ గాఁబడరానిదై
యనుచుఁ దప్పొకటివ్రా ♦ యంగ నేల
వామనకృతసూత్ర ♦ వర్తియా ప్రాయేణ
పదముచే రక్షింప ♦ బడునటంచు
ననసేల దప్పువ్రా ♦ యఁగదిద్దఁగను మొట్ట
మొదటిపద్యమ్మున ♦ నె దగునె యన

జాడఁదెలియవుగా ♦ జాడనాచార్యులు
గా రేమిచేయుచు ♦ న్నారన నన్ను
గీ. తమ్ములాడుటనవ్వాని ♦ తప్పుదిద్దు
కొనుచునున్నారనెడుసామె ♦ తను సరిగను
స్మృతికిఁ దెచ్చెదుఁ బ్రాియేణ ♦ గతి గ్రహించి
దానికి సమర్థనముఁజేయఁ ♦ బూనుటరయ. 24

సీ. పదిపద్దెముల వ్రాసి ♦ భ్రాంతినొందుట యన్న
పల్కుచ్చటిదియె ♦ సంబంధమెచట
దాని కేర్పడియుండె ♦ నో నీవెఱుంగక
పదిపద్దెముల వ్రాసి ♦ బ్రమతపడుట
కాదటం చంటివి ♦ శ్రీ.ది.తి.శాస్త్రిచే
విరచితయాపద ♦ వీధియందు
మొదటిపద్దెమ్మున ♦ మొదటిపాదమ్మునఁ
బ్రాసమ్ముమఱచియా ♦ వ్రాఁతవ్రాయు
మంతులుందురెయని యందు♦ముందు వెనుక
నున్న వాక్యాళిసంబంధ ♦ మున్నదాని
నిచట వ్రాయుట మఱియుఁ బై ♦ నేవగించు
కొనుటయును దెల్పెదేటల ♦ నొనరఁదెల్పె. 25

శా. నీబోంట్లెక్కడ వారలెక్కడకలా ♦ నీకావలోకాతిశా
య్యాబంధాత్ములువిజ్ఞవిశ్వవిశద ♦ ప్రాప్తావధానక్రియా
ఖ్యాబోధుల్ మఱి నీవొసాహితినిన ♦ వ్యమ్మందుఁగొం చెమ్ముగా
డాబుంజెందితి వింతకే గలహమా ♦ డ న్నీకు యుక్తంబొకో. 26

చ. అనవినరానియిట్టిపలు ♦ కాడఁగ నోరెటులొప్పెనోయి పూ
ననియనుమాన మానివిమ♦నస్కుఁడవౌటయయుక్తమోయిచా

లనిపని యేలనోయి దన ♦ లావు నెఱింగిచరింపుమోయి తి
న్ననిమతినొందుమోయిసుజ ♦ నంబులత్రోవనుఁబోయిమిత్రమా.

క. నీవె గురులంచువారౌను
నావిజ్ఞులె వాదమునకు ♦ నావంతయు ధై
ర్యావేశము లేకుండఁగ
నీవా యిఁక వారిముందు ♦ నిలుచుట చెప్పుమా. 28

ఉ. ఆమహనీయపాదయుగ ♦ ళాంబుజసేవన లబ్ధసత్కళా
శ్రీమహనీయులైనబహు ♦ శిష్యులలో కడసారివానినై
నా మతిపోలఁజాలుదువె ♦ న్యాయమున న్సరిపోరజాలుదే
నీమతిమత్తయున్* దెలియ ♦ నేదెలిసెన్ సుమిపాఠళిక్. 29

గీ. నీవ యవధానమును జేయ ♦ నేర్తువేని
మంచిదేసుమ్మి యింతటి ♦ మాత్రముననె
నష్ట మేమయ్యె శతవధా ♦ నమ్ముఁజేయఁ
జాలవని వారువ్రాసిరే ♦ యేలయింత. 30

గీ. అన్నిపత్రికలందును ♦ నున్నయట్టి
పల్కులను బోఁగుఁజేసిరి ♦ ప్పగిదికింత
యులుకుఁజెందెద వెందుల ♦ కున్నమాట
యన్న నులుకుండెనేనిప ♦ త్త్రాశ్రినుము. 31

ఉ. అందఱువ్రాసినట్టివచ ♦ నాళి విచారణ వీరికేల? వా
నిం దయివాఱునట్లుగనె ♦ నీస్థితియంతయు వ్రాయఁగాఁబడెన్
అందఱు వ్రాసినట్టివచ ♦ నాళి యసత్యమటంచుఁ బల్కఁగా
నందియ మొందఁగావలదె ♦ చాలును వాదనయంటివింతియే. 32

క. నీయవధానము బుధగణ

---

* ఈశివరామకవి చివరపుటలోని సీసములో "బుద్ధిమత్త" యని ధర్మిపరముగా వ్రాసినాఁడు.

నీయష్టగుగుంటు రెఱుఁగు ♦ నిక్కమిమ్మంకఁ
నీయంతరాత్మ యెఱుఁగు జ
నీయాభిప్రాయమెల్లు ♦ నెగడెడుఁగనుమా. 33

సీ. భాష్యమంతయు నీవు ♦ పఠియించినట్టుల
పడవ్రాసెదవు సని ♦ పఠనివాౖంత
లాసంస్కృతశ్లోక ♦ మందున దోషమే
మియు లేదు నిజము స ♦ మిద్ధమిదియ
భాష్యమందలివాక్య ♦ ఫక్కికి నిటఱనే
నంబంధమును లేదు ♦ సరసమైన
శైయటు నభిసంధిఁ ♦ గనుఁగొను మేశాస్త్రి
లొద్దనో పాదమ్ము ♦ లొత్తి; యుఱియుఁ

గీ. గ్రమవిహీనాన్వయమ్మయాఁ ♦ గాకద్వంద్వ
మందు పెద్దలుదోసమం ♦ చనరుసరిగ
దా! మనోజ్ఞమయేని య♦ర్థమ్ము శ్లాఘ్య
ముగ గ్రహింతిరిటనట్టి దో♦సఁగును లేదు. 37

చ. అనృతముఁ బల్కఁబోక బుధు♦లందఱకు న్వినతుండయౌచుఁ ది
న్నని నయమార్గమున్విడక ♦ నవ్యవిశేషనివిష్టచిత్తుఁడై
తనకనురూపవేషమును ♦ దాల్చెడువాఁడు యశోభిరాముఁడై
మనియెదుఁగాక భూమి నయ ♦ మార్గము వీడినఁ గీర్తిగల్గునే. 34

ఆ. గీ. ఎందునుంగూడ సందర్భ ♦ మేమిలేని
నామమున నొప్పు శివరామ ♦ నామకృతముఁ
దాలుకుట్టనమునుమహి ♦ ధ్వస్తముగను
జేయఁ బ్రతినను గొనియిటు ♦ చెప్పియుంటి. 35

వేదాల, తిరువేంగళాచార్యులు.

ఓమ్.

పరబ్రహ్మణే నమః.

# శ్రీ రామకృష్ణమహాభారతము.

## ప్రారంభ పర్వము.



పృథ్వీ-శ్రియం భజతు సత్కవిసృజతు కింకవి ర్దుష్కృతీ
ర్బుధో విమృశతు స్వయంస్ఫుటతు సౌష్ఠవం దౌష్ఠవం
సుధీ ర్మధుసుధారసస్ఫురిత గర్వసర్వంకష
ప్రచారపదకర్మఠః పఠతు భారతం గీరతమ్. 1

శా. శ్రీమంతుం డగువిష్ణువర్ధనుని బేర్మిం జూచి, మన్మత్సుమా
స్వామిం బ్రేముడి మీఱఁగా నరసి, కృష్ణారాయపృథ్వీధవున్
సామర్థ్యంబునఁ గాంచి యన్నిటఁ బ్రశంసాపాత్ర మై యాశ్రిత
క్షేమంబుల్ పరికించు నంధ్రకవితల్ సేవింపుఁడీ భూపతుల్. 2

చ. జలజలఁ గమ్మతేనియలు జాలుకొన న్ననుకప్పరంపుఁబ
ల్కుల దొరయంగఁ జాలుపలుకుల్ దులకింపఁగఁ జేయుతల్లి! నేఁ
డలఘుతరప్రమోదమధురామృతపూర్ణకటాక్షలక్ష్మలం
జిలుకుచు నొక్కసారి దయ సేయఁ గదే! కవితాసరస్వతీ! 3

చ. అహరహరాంతరప్రసరణాతి విపృద్ధ సమృద్ధ గర్వధూ
ర్వహకుకవీంద్రవక్త్రకుహరస్థల నిర్గత భూరిదుర్వచో
గహనదవాయమానకృతి కాండములన్ రచియించుపట్టులం
దహాతహఁ గూర్ప నీ కెపుడుఁ దప్పదు సూ! కవితాసరస్వతీ!

తరలము. బులుసు పాపయశాస్త్రి వైదిక♦పూరుషోత్తము, శాబ్దికో
జ్జ్వలుని భాగవతాన్వయున్ హరి♦శాస్త్రి, నార్థికమండలీ
తిలకు శ్రీపదరామశాస్త్రి ను♦తించి యంచితసాహితీ
నిలయుఁ గొల్లురి కామశాస్త్రి గ♦ణింతు వాక్పరిశుద్ధికిన్.

మ. అనసూయాత్మజుని గోత్రధవర్జితుని వి♦ద్యాపారగున్ రమ్యసూ
క్తినిధి న్నిర్మదభావు నూర్జితమతిన్ ♦ దివ్యద్యశున్ శుద్ధవ
ర్తను నాచార్యుని శిష్యవత్సలుని సం♦ధ్రవ్యాసుఁ డన్ పేరుఁగాం
చినశ్రీవ్యాసమహాకవీశ్వరుని సం♦సేవింతు నశ్రాంతమున్. 6

చ. పరుసదనంబు స్వాతిశయ♦భావ మసత్యము ప్రల్లదంబు మ
చ్చర మసహిష్ణుతాభర మ♦శాంతి యనాదరణంబు మున్నుగాఁ
బరఁగెడుదుర్గుణంబు లొక♦పట్టునఁ బూననివాని దేవతా
గురుసముఁ జిత్రవాక్ప్రసరుఁ ♦ గొల్చెద మల్లసుధీసుధాకరున్. 7

క. గీర్వాణవాఙ్మయము మా
కిర్వుర కొక్కట ననుగ్రహించిన కవితా
సర్వజ్ఞుని నారాయణ
గుర్వగ్రణిగుఱిచి యేటి♦కోళ్లు ఘటింతున్. 8

క. ప్రాచేతసమునిముఖ్య
ప్రాచీనమహాకవిప్ర♦పంచంబునకున్
మోచాఫలరసభరత
ద్వాచార్భటులకుఁ బ్రణామ♦పర్యాయంబుల్. 9

శా. శ్రీగంభీరవచోవిలాసమహదా♦శీర్లబ్ధసారస్వత
ప్రాగల్భ్యంబున మెప్పుఁ గన్నకవులం♦ బ్రత్యర్థిభావంబునన్
వాగర్థమ్ములపొల్పు పాల్పడనిదు♦ర్వాదమ్ములన్ నొంచు ది
జ్నాగాచార్యులు గొంద ఱిప్పటికి ను♦న్నా రిందు వర్ణింపఁగన్. 10

ఉ. పెంపు వహించి యున్నసుక ♦ విప్రకరమ్ములఁ గాంచి యీర్ష్యచేఁ
దెంపరులైన కాకవులు ♦ తేఁపకు వారల కెగ్గుసేయ నే
తంపులు వన్ని నంజెదునె ♦ తన్మహనీయత? వేఁడినీళ్లకుం
గొంపలు గాలునే? తగని ♦ కోరిక దైవము సమ్మతించునే? 11

ఆ.వె. కాకి కన్నపిల్ల ♦ గాకికి ముద్దైన
యట్లె కుకవికావ్య ♦ మతని కింపుఁ
గూర్చుచుండుఁ; గానఁ ♦ గోవిదు లద్దాని
మెత్తురనియె మది భ్ర ♦ మించు నతఁడు. 12

ఆ.వె. తాను సుకవి యనియుఁ ♦ దనదుకవిత్వంబు
సత్కవిత్వ మనియు ♦ సరసులెల్ల
దాని మెత్తురనియుఁ ♦ దలపోయుటయ కాని
యాత్మదోష మెఱుఁగఁ ♦ డకట! కుకవి. 13

ఆ.వె. పంచదారకన్నఁ ♦ బానకంబునకన్న
మావిపండుకన్న ♦ మాధ్వికన్నఁ
దనదుపలుకుతీయఁ ♦ దనమె యెక్కు డటంచుఁ
జెప్పుకొనఁగఁ గుకవి ♦ సిగ్గు వడఁడు. 14

క. తన కిచ్చువాఁడు కర్ణుఁడు
దను మెచ్చినవాఁడు బుధుఁడు ♦ దన కిచ్చకముల్
గొని తెచ్చువాఁడు సూనృత
ధనుఁ డనియును ముచ్చటింపఁ ♦ దలఁకరు కుకవుల్. 15

క. ఒకపండితుఁ డొకపామరుఁ
డొకలోకంబైన నేమి ♦ యో యనవచ్చున్
సకలమ్ముం దముఁ దెగడిన
స్వకీయదోషమును దెలియఁ ♦ జాలరు కుకవుల్. 16

సీ. ఆమ్నాయశిఖరంబు♦లందు వ్యాసుల మన్న
మీమాంసలోన జై♦మినుల మనిన
పాణినీయమునందు ♦ భాష్యకారుల మన్నఁ
దర్కమ్మునందు గౌ♦తముల మనినఁ
గవితాప్రసక్తి♦లోఁ గాళిదాసుల మన్న
జ్యోతిషంబున బృహ♦స్పతుల మనిన
గానశాస్త్రమ్ములోఁ ♦ గలహాశనుల మన్న
నితిహాసముల సూత ♦ సుతుల మనిన

గీ. ననుకొనఁగ వచ్చు; నెవ్వరుఁ ♦ గననిచోట
నెన్నియజ్ఞములైనఁ జే♦యింప వచ్చుఁ
దగినసమయమ్ము గూడిన♦తఱిని వారి
పాండితీవైభవము బటా♦బయలు గాదె? 17

గీ. బట్టు నొక్కని నన్నయ♦భట్టటంచు
వాజి నొకనిఁ దిక్కనసోమ♦యాజి యనుచు
నెవ్వరో కొంద ఱూరక ♦ యేమొ పొగడ
నంతమాత్రాన విబుధు లె♦ట్లాదరింతు? 18

మత్తకోకిలము.

భక్తితోఁ గవితాసరస్వతిఁ ♦ బ్రస్తుతించి మహాత్మతా
సక్తిఁ బండితసార్వభౌముల ♦ సన్నుతించి కృతజ్ఞతా
యుక్తిఁ జర్లకులాబ్ధిచంద్రగు♦రూత్తముం గొనియాడి కూ
ద్రిస్తులం దెగనాడి భారత♦దీక్షఁ బూనితి మిమ్మొయిన్. 19

ఇది శ్రీరామకృష్ణమహాభారతమునందుఁ బ్రారంభ
పర్వం బను ప్రథమపర్వము.



## భారతప్రశంసాపర్వము. 2

గీ. భరతవంశ్యులచరితముఁ ♦ బ్రస్తుతించి
భారత మ్మయ్యెఁ దొల్లిటి ♦ భారతమ్ము
భారతీవాదగాథల ♦ బయలుపఱిచి
భారత మ్మయ్యె నిప్పటి ♦ భారతంబు. 20

గీ. పరులయున్నతిఁ గని దుఃఖ ♦ పడెడువారు
దోషరహితులఁ బూజ్యుల ♦ దూఱువారు
నాత్మదోషమ్ముఁ బరులపై ♦ నలమువారుఁ
బరిహసింపఁగఁ బడుదు రీ ♦ భారతమున. 21

ఉ. భూనుతకీర్తులై మహిమఁ ♦ బొల్చినబ్రహ్మఋషుల్ కవిత్వవి
జ్ఞానఘనుల్ దొరల్ విని పొ ♦ గడ్త లొనర్ప నశేషధర్మస
మ్మానితముల్ విచిత్రపద ♦ మండితపర్వము లైనభారతా
ఖ్యానవరిష్ఠముం గనియ ♦ థార్థముఁ జేకొనుఁడయ్య పండితుల్. 22

ఉ. ముందటిసత్కవుల్ నుడివి ♦ మోద మొనర్చిరి; నేఁటివారలుం
గొందఱు కర్ణపర్వ మొనఁ ♦ గూర్చుచు నుండిరి యింక మీఁద నే
నెందఱొ దీనిఁ జక్క వెల ♦ యింపఁగలారు ధరిత్రిభారతా
నందరసంబుఁ గ్రోలనిజ ♦ నంబులు గానఁగరా రొకప్పుడున్. 23

ఉ. ధర్మము నర్థకామములు ♦ తత్త్వవిచారము లోకయాత్రయున్
నిర్మదభావగౌరవము ♦ నీతివిశేషము లార్యవృత్తముల్
శర్మము ప్రౌఢవాదములు ♦ సద్గురుదైవసపర్య భారతీ
మర్మములున్ యథార్థముస ♦ మస్తమునిందుఁ బ్రకాశితంబగున్. 24

గీ. సకలపూరుషార్థముల ని ♦ స్సంశయముగ
వెలయఁ జేయుచు సంక్షేప ♦ విస్తరముల
భారతసహస్రభానుగ ♦ భస్త్రిచయము
మానుషులగీరతాంధ్యము ♦ మట్టుపెట్టు. 25

గీ. పలుకుబడి తేటవెన్నెల ♦ వెలయఁ జేసి
గీరతనిమీలితేక్షణ ♦ కైరవములఁ
బొలుపుఁ జెందించుభారత ♦ పూర్ణచంద్రుఁ
డఖిలకవులకు సంతోష ♦ మావహిల్లు. 26

గీ. ప్రబలమోహాంధకారసా ♦ రణ మొనర్చ
నోపు నీయితిహాసప్ర ♦ దీపవర్తి
భావకస్నేహసంబంధ ♦ బాంధవాప్తి
లోకగర్భగేహమున వె ♦ లుంగు నించు. 27

గీ. గీరతాజ్ఞానతిమిరని ♦ గీర్ణదృష్టు
లై పథముఁ దప్పి యడవి న ♦ ల్లాడు నరుల
కలఘుతరపరిజ్ఞానక ♦ జ్జలకణికలఁ
గనులకు వికాస మొసఁగు నీ ♦ గ్రంథరాజు. 28

చ. తిరుపతిశాస్త్రివర్తనము ♦ దేశికతం గడియించు వేంకటే
శ్వరుఁ డసహిష్ణుభావమునఁ ♦ జల్పినజల్పనకల్పనమ్ము వే
లురిశివరామశాస్త్రికృతు ♦ లుం జిన వేంకటశాస్త్రిచర్యలున్
మఱియు ననేకగాథలుఁ గ్ర ♦ మమ్ముగ నిందువచింపఁగాఁబడున్. 29

గీ. అనృతవిషయమ్ములెల్ల స ♦ త్యములు గాఁగఁ
జెప్పి మెప్పులుగొనుట మా ♦ చేతఁ గాదు.
ఉన్న దున్నట్లు వ్రాసెద ♦ మొప్పుఁ దప్పుఁ
జెప్ప రారయ్య పండిత ♦ శ్రేష్ఠులార! 30

క. గీరతములోనఁ గలని
స్వారాఖ్యానములసత్య ♦ సందర్భములున్
దీరిచి వక్కాణింపం
బ్రారంభింపఁగ నదొక్క ♦ భారత మయ్యెన్. 31

క. కృతిముఖపద్యము మొదలుగఁ
బ్రతిపద్యమునందు నిందు ♦ బహుభంగుల గీ
రతఘటితానృజువిషయ
ప్రతతికి ఖండనము లుండుఁ ♦ బరికింపఁ దగున్. 32

క. తనకంటె నిలాతలమున
ఘను లెవ్వరు లేరటంచు ♦ గర్వమ్మున మ
న్నను మిన్నను గన కుండెడు
మనుజుఁడు దెలియంగ లేఁడు ♦ మాభారతమున్. 33

క. ఏవంవిధభారతవి
ద్యావిభవము విస్తరింపఁ ♦ దత్కారణస
ద్భావము వక్కాణింతుము
కోవిదులు ముదమ్ము నొంది ♦ కోయని యార్వన్. 34

స్వాప్నికపర్వము. 3

మ. పృథులాటోపుఁడు వేంకటేశుఁడు మహా ♦ వృక్షంబహంతాగుణ
గ్రథితస్వాంతుఁడు తిర్పతిస్థిరుఁడే ♦ స్కంధంబు ద్వైపాయన
ప్రథముల్ శాఖలు గీరతం బపరిప ♦ క్వంబౌఫలం బింతయున్
మధునాపంతులవంశవర్ధనముఖుల్ ♦ మధ్యస్థితుల్ మూలముల్. 35

సీ. ఆభాస మగుశ్రీవ ♦ ణానందమునకన్న
విపరీతభావనల్ ♦ వెలయుదానిఁ
బాణిగృహీతాప్ర ♦ బంధంబుకంటెను
బాపమ్మునకు దారిఁ ♦ జూపుదాని
సారె నానారాజ ♦ సందర్శనముకన్న
నపలాపములకుఁ దా ♦ వైనదాని
నటమట మగుపాండ ♦ వాశ్వమేధముకంటె
నడవియై తప్పులఁ ♦ బడినదాని
గీ. నుత్తరమ్ములచెత్తతో ♦ నుదరపూర్తి
సేసికొని పంచమామ్నాయ ♦ సిద్ధికొఱకు
వ్రితమొనర్చెడుదాని గీ ♦ రతముఁ జదువ
నఘము లంటుట కేమియ ♦ భ్యంతరంబు? 36

పృథ్వి. జగమ్మునకు శత్రువై యనృత ♦ శక్తికి౯ భర్త్రియై
ప్రగల్భవచనమ్ములుం బహుల ♦ భంగపద్యమ్ములు౯
విగీతవిషయమ్ములుం గలిగి ♦ విద్వదాక్షిప్తమై
నగీరతముఁ బట్టిచూచినను ♦ నారకం బయ్యెడు౯. 37

గీ. అని తలఁచి గీరతమ్మున ♦ యందుఁ గలుగు
పాపమును రోయుభారముఁ ♦ బ్రజలమీఁదఁ
బెట్టి దానికి మఱువ్రాయ ♦ కట్టె యూర
కుండఁ దలఁపనితలఁపుగా ♦ నొక్కరాత్రి. 38

ఉ. నిద్దుర వోవునప్పు డొక ♦ నీరదనీలశరీరుఁ డెవ్వఁడో
యద్దమరేయివేళఁ గల ♦ యందుఁ గనంబడి యొయ్యనొయ్య మా
యొద్దకు వచ్చి, విన్నఁబడి ♦ యున్నమొగంబును మాటిమొద్దిమా
సుద్ది వచింప నెంచి పొడ ♦ సూపినయట్టులు గాననాటయు౯. 39

ఉ. ఆతనిరూపుచొప్పుఁ గల ♦ యం బరికింప నతండు మాకుని
ష్కైతుకవైరి యై కలఁకు ♦ లీనెడు వేంకటశాస్త్రి యయ్యె న
స్థితఁడు మచ్చరమ్ము విడి ♦ యేమిటి కీగతి నేగుదెంచె? నౌ
రా! తెలియంగరా దనుచు ♦ నచ్చెరువుంగనుచుండ నాతఁడుఁ.

క. తెచ్చుకొనునట్టి తెలివియు
నచ్చొత్తినరీతిఁ దోఁచు ♦ ననుతాపంబుఁ
దచ్చనలాడుకొనంగా
మచ్చికమెయిఁ గూరుచుండి ♦ మాకిట్లనియెఁ. 41

క. మీయెడ నేదోసము లే
దోయకలంకాత్ములార! ♦ యూరక వైరో
పాయమ్ముం గల్పించి య
సూయావిష్టుండ నగుట ♦ జఁడి తలపడితిఁ. 42

ఆ. వారివారిపగిది ♦ మీరును వెఱపంది
యూరకుందు రనుచు ♦ నూహసేసి
పద్యములను వ్రాసి ♦ ప్రకటించితిని గాని
యింత యగు నటంచు ♦ నెఱుఁగనైతి. 43

మ. అవధానమ్ము లొనర్చి పీఠపురరా ♦ జాస్థాని మెప్పించి గౌ
రవముం గాంచిరి రామకృష్ణు లని వా ♦ ర్తాపత్త్రికల్ సెప్ప నా
కవమానంబు ఘటిల్లినట్లు హృదయం ♦ బాందోళనం బందె ని
య్యవివేకంబున కీరునవ్వకుఁ డసూ ♦ యావృత్తులిట్లుండెదుఁ. 44

మ. నలనాభాగసముండు సూర్యధరణీ ♦ నాథుండు పట్టంచుసా
ల్వాలు మున్నాటపదార్థు వెట్టి మిము సం ♦ భావించెనే నింత నే
నలఁతంజిక్కెడువాఁడఁ గానుజఁడి మి ♦ మ్మాస్థానవిద్వత్కవీం
ద్రులుగా నిల్పుటఁజేసినామనమిటుల్ ♦ దుఃఖంబునం దూఁగెడిఁ.

సీ. మును పెన్నఁడోకాని ♦ మనశాఖలో నాణి
విల్ల వేంకటసోమ ♦ పీఠి యొక్కఁ
డాస్థానకవి యయి ♦ యలరె నాఁటికి నేఁడు
రామకృష్ణకవీశ్వ ♦ రద్వయంబు
చిన్నతనంబులో ♦ శ్రీపీఠికాపురా
స్థానకవీంద్రులై ♦ శాఖకెల్ల
యశ మిడిరనుచుఁదోఁ ♦ టఱవ లెల్లరు మిమ్ము
హర్షమ్ముతోఁ గొని ♦ యాడుచుండఁ
గీ. గట్ట! నే నొక్కరుండ నే ♦ కాకి నగుచు
మిమ్ము దూఱుచునుంటి నా ♦ యమ్మలేక
లోకనిందకుఁ బాత్రైతి ♦ నాకతమున
సాధుబాంధవులకు మన ♦ స్తాప మయ్యె. 46
ఉ. పగ్గకు మిమ్ముఁ గెల్తు నని ♦ పల్కుచు నుందును గాని, కృష్ణుతో
నెగ్గఁగలేము తిర్పతియు ♦ నేనును; నాతనిపేరు విన్నచో
దిగ్గురను న్మనం; బెపుడు ♦ దృప్తమృగాధిపడింభమో? యనన్
దిగ్గనఁ బైఁబడంగనరు ♦ దెంచునొ? యంచుభయంబుఁ జెందుదున్.
క. కవితాపత్త్రికఁ గానం
గవితాకు జనించు నాకుఁ ♦ గమనీయశ్రీ
కవిశదవిషయాన్వయపా
కవిశేషమ్ములను జూడఁ ♦ గన్నులు కుట్టున్. 48
క. ఆకుండి వ్యాసమూర్తిమ
హాకవిశేఖరుఁడు వంద్యుఁ ♦ డయ్యనఘునెడన్
నా కెంతయు గురుభావం
బే కల దాయనమహత్త్వ ♦ మే నెఱుఁగనొకో. 49

గీ. పరమశాంతస్వరూపుఁడు ♦ నిరుపమాన
శేముషీవైభవుఁడు సాధు ♦ చిత్తుఁ డఖిల
శాస్త్రసంవేది యుభయభా ♦ షాప్రవీణుఁ
డామహాత్ముని వ్యాసుఁడే ♦ యని తలంతు. 50

క. ఏ నింజరమున నుండం
గా నామాన్యుం డొకప్డు ♦ కార్యవశమునన్
దా నటకు వచ్చె; నభ్యు
త్థానం బొనరించితిని ము ♦ దంబున నేనున్. 51

మ. గురువర్యుం డగువ్యాసభట్టరునియం ♦ ఘ్రుల్ పట్టి భక్తిన్నమ
స్కరణమ్ముల్ పొనరించియెంతయును స ♦ త్కారమ్ములో నాదుమం
దిరముం బావనమాచరింపుఁ డని ప్రా ♦ ర్థింపంగ నాదేశకుం
డురరీకారము సేసె మచ్చిరకృతాం ♦ హోరాశియిట్లింకఁగన్.52

క. సౌగుణ్యనిధియు విద్యా
సాగరుఁడును నైనవ్యాస ♦ శాస్త్రులకడ బా
గోగు లరయ మాదేవీ
భాగవతముఁ గొంతకొంత ♦ పఠియించుటయున్. 53

క. ఆయాఘట్టమ్ములలో
నాయన యెఱిఁగించినట్టి ♦ యంశమ్ములచే
నాయనఘుని పాండిత్య
శ్రీ యేర్పడ నద్భుతంబుఁ ♦ జెందితి మదిలోనన్. 54

చ పదపడి నేఁడు వ్యాసముని ♦ పఙ్క్తికిఁ గల్గెనటంచుఁ బొంగి నా
సదనమునందు విందొకటి ♦ సల్పితి శ్రీరఘురామమూర్తికిన్
సదమలభక్తిమై శబరి ♦ సల్పినయట్టులు నాదుశక్తికిన్
గొదవయొకింతయేనియొడఁ ♦ గూడకయుండఁగ జాగరూకతన్.55

ఆ. అధికభక్తి నిట్టు • లాయనఁ బూజించి
విడె మొసంగి మివుల • విలువ గలుగు
నభినవాంబరముల • నర్పించి యనిపితి
నిద్ది మీరు సైత • మెఱిఁగియుండ్రు. 56

క. "ఏనాము" లోన మీ రవ
ధాన మొనరించునట్టి • తఱిఁ బృచ్ఛకులం
దే నొక్కరుండ నై యా
ధీనిధిఁ గొనియాడఁ గోరి • తిని గీతమునన్. 57

ఉ. వ్యాసమనీషి మల్లబుధ • వర్యుల మీరు నుతించుచుండుటం
జేసియ వారు మీ కెదియొ • చెప్పక పోరని యెంచి వారిపై
రోసముఁ బూనితి న్నిజము • రోయఁగ వారికి మీప్రసక్తిలో
వీసముఁ బాలు లే దనుచు • వింటిని; గార్యము మించఁబెట్టితిన్.

క. ఇది మొదలనే యెఱుంగుదు
మదిలో; నట్లయినఁ బయికి • మాత్రము వారిం
బదరుదు శతఘ్ని కతమునఁ
బొదలెడు మీయశముఁ బులిమి • పుచ్చుటకొఱకున్. 59

చ. వశగతసాహితీధనుఁడు • వ్యాసకవీంద్రుఁడు కృష్ణశాస్త్రికిన్
శ్వశురుఁడు గాన నేమయిన • సాయ మొనర్పఁడె యంచ పభ్రమన్
దిశలు వణంకఁ దత్కృతులఁ • దిట్టితి నాయన లెక్కసేయఁడా
పరిశ్రమఫలంబు నామెడకుఁ • బామయి చుట్టునొ యంచుఁ గుందుదున్

క. అవ్వారిమాఱు పేరున
బ్రివ్వం దిట్టితిని వ్యాస • బుధు; నాయన నన్
నవ్వెడినఁట నా తెలియని
చివ్వకు నాపాప మెట్లు • చేడ్పడుఁ జెపుఁడీ. 61

ఆ. వ్రాసినాఁడఁ గ్రొధ • వసుఁడ నై గీరత
మందు లేనిపోని • యంశములను;
గాన నామనంబు • కలగుండువడఁ జొచ్చెఁ;
బాపభీతి నన్ను • వేఁపఁ దొడఁగె. 62

ఉ. కేవలకల్పిత మ్మయిన • గీరతకావ్యకథావిధాన మాం
ధ్రావలిలోనఁ గొందఱు య•థార్థ మెఱుంగమి నిక్కమంచు సం
భావన సేయుచోఁ గలుగు•పాపము నన్నె ఘటించు నిట్టివే
కావొకొ సాధుసజ్జనని • కారమునన్ సమకూఱులాభముల్. 63

ఆ. అక్కృతమ్మ్రనఁ బగవార • లనుచుఁ దలఁపఁ
బోక మీకడ నిది వెళ్లఁ • బోసికొనఁగ
నరుగు దెచ్చితి; నాపలు • కాలకించి
యూరకుండక మఱు వ్రాయుఁ • డోయి మీరు. 64

క. సార్థబోధకంబుగ
భారత మనుపేర నొకప్ర • బంధము మృదుగం
భీరతరవచనరచనా
పారీణత మీఱ మీరు • పలుకఁగవలయున్. 65

ఉ. చేసినయట్టిపాపములు • చెప్పినఁ బోవు నటండ్రు; నేన నా
దోసము వెల్లడించిన బు • ధుల్ పరిహాస మొనర్తు; రన్యథా
శ్వాసము లేదు మద్వృజిన • సంతతికిన్; భవదీయవాగ్గుఫ
న్యాసవిశేషపూర్తుల న • మస్తముఁ జక్కఁబడున్ ధ్రువమ్ముగన్.

క. నిశ్చయము దెలియఁ బొడమిన
పశ్చాత్తాపంబు నాదు • పాపమునకుఁ బ్రా
యశ్చిత్తగ నే నిట్లు చి
వశ్చిధితవాక్యములను • బలికితిఁ జుండీ. 67

చ. అని వచియించి లోనఁ గల ♦ యట్టివిచారము నెల్ల మోమునం
గనులను వెల్లడించుచు ని ♦ కం జనువాఁడ నుపేక్ష సేయకుం
డనుచు నదృశ్యుఁ డై చనియె ♦ నక్కవి; యంతటఁ దెల్లవాఱమే
ల్కాని కలలోనియంశముల ♦ కున్ మదినచ్చెరుపాటుఁ జెందుచున్.

ఉ. గీరతకావ్యకర్త్రికిఁ జి ♦ కిత్స యొనర్చుట మాకు నించువ్యా
పారమె కాన రోగియును ♦ వైద్యుఁడుఁ బాలనె కోరినట్లుగాఁ
గూరిన దంచు నెంచి పద ♦ గుంభనమున్ రసపుష్టియుం జమ
త్కారము మీఱ భారతక ♦ థన్ రచియింపఁగనైతి మంతటన్.

ఉ. తిక్కనసోమయాజులు కృ ♦ తిం గలవచ్చినయట్లు వ్రాయుటన్
దక్కినవారు పెక్కు రది ♦ దారిగఁ గావ్యములందు నెద్దియో
యొక్కకలన్ లిఖించుటయు ♦ నున్నది ; యట్టులుగాక యిక్కలన్
నిక్కలగా మనీషులు గ ♦ ణింపుఁ ; డసంగతి లేదు దీనిలోన్. 70

క. కలలం దొకతఱి సత్య
మ్ములు ననుభూతము లదృష్ట ♦ ములు భవితవ్య
మ్ములు నైన పెక్కువిషయ
మ్ములు దోఁచుచు నుంట తథ్య ♦ ము గదా మనకున్. 71

కథావతారపర్వము. 4

క. ఓలిఁ బరవాదివీరుల
నోలేటీ ! యనుచుఁ బిలిచి ♦ యోర్చుటచేఁ ద
మ్మోలేటివా రనంగాఁ
బోలినభూసురులు రాజ ♦ పూజితు లెందున్. 72

ఉ. పండితు లాత్మధర్మపరి ♦ పాలనదీక్షితు లన్యవాదివే
దండఘటామృగేంద్రులు బు ♦ ధస్తవనీయచరిత్రు లుర్వరా
ఖండలసంసదగ్రపరి ♦ కల్పితకాంచనపీఠు లుద్యశో
మండితు లైనవారు శఠ ♦ మర్షణగోత్రు లోలేటివంశజుల్. 73

సీ. మెండుగా ధనకనకమ్ము ♦ లుండకున్నఁ
గలిగినది తిని పరితుష్టిఁ ♦ గనుటె కాని
తివిరి యన్యులకడ కేగి ♦ దేహి యనుచుఁ
జేయి సాఁచి యొకప్డు యా ♦ చింపఁ బోరు. 74

ఉ. సాటి గనంగరానిబుధ ♦ సత్తములం గని వన్నెఁ గొన్నయో
లేటికులంబునందు విధు ♦ లీల జనిం గని రామశాస్త్రి జం
జాటములేనిసూరయభు ♦ జంగమరాయలతోడ బత్తియుం
బాటుగ రెండుకావ్యములు ♦ పాఠము సేసె నివాసభూమిలోన్.

క. పదఁపడి తనయభిజనమునఁ
జదు వనుకూలముగ నేర్వ ♦ సాఁగమి విద్వ
త్సదన మగుకారవల్లికిఁ
గదలెన్ విద్యాధనమ్ముఁ ♦ గడుఁ గడియింపన్. 76

సీ. కారవల్లిని మేనత్త ♦ గారియింట
నెలవుకొని నాలు గైదేండ్లు ♦ నియతి నేర్చెఁ
జర్లనారాయణబుధేంద్రు ♦ సాకతముఃఁ
గావ్యనాటకాదులు లఘు ♦ కౌముదియును. 77

శా. తా నాయూరికిఁ బోకమున్నె పితృసో ♦ దర్యుండు దైవంబుచం
దానం దెల్పినసంస్కృతాంధ్రములఛం ♦ దఃప్రక్రియల్ సాహితీ
జ్ఞానంబుం బడి గైతఁ జెప్పుచుఁ బితృ ♦ ష్వస్రాత్మజుల్ వాఙ్మయో
ద్యానక్రీడనభూష్ణుఁ గృష్ణుఁ గవితా ♦ ధ్వన్యుం బొనర్చెన్ గృపన్.

సీ. అంతఁ దనతండ్రి ప్రబలరు ♦ గార్తుఁ డగుడు
నతని విడి యొండుకడ నుండ ♦ ననువుగామి
స్వస్థల మ్మగుపల్లియ ♦ పాళె మేగి
యచటఁ బితృసేవ సేయుచు ♦ నట్టె యుండె. 79

క. గణుతి గలవ్యాసముఖబుధ
మణులు తటస్థించినపుడు ♦ మానక విద్యా
ఘృణులు గొనె వారిచెంగట
" క్షణశః కణశశ్చ " యనువ ♦ చనము రుచింపన్. 80

గీ. అవల వీరేశవిబుధద ♦ యావిశేష
సముపగతశబ్దశాస్త్రవి ♦ శారదుండు
సారసాహిత్యవిజ్ఞాన ♦ చక్రవర్తి
యైనకృష్ణుఁడు తనకు స ♦ హాయుఁ డగుడు. 81

క. తీయనిపలుకులఁ గృతులం
జేయుచు నవధానముల ర ♦ చించుచు నెంతేఁ
దీయమున క్షీరనీర
న్యాయముగాఁ గృష్ణుఁ గలసి ♦ యతఁ డొప్పారెన్. 82

చ. పదఁపడి పీఠికాపురనృ ♦ పాలురసజ్ఞతయున్ సుకీర్తిసం
పదయు వదాన్యతాఘనత ♦ పండితలోకసమాదరంబు నె
ల్లదెసల నుల్లసిల్ల నతు ♦ లప్రమదంబున నాలకించి నె
మ్మది నలపార్థివోత్తముస ♦ మక్షముఁ జేరెదుకోర్కె లూరఁగన్

గీ. అనుఁగుమేనత్తకొడుకుఁ గృ ♦ ష్ణార్యుఁ గూడి
యాంధ్రదేశాభరణ మన ♦ నలరుపీఠ
పురవరమ్మున కరిగి త ♦ ద్ధరణినాథు
కొలువులో నవధానముల్ ♦ సలుపుటయును. 84

మ. కవితాసారవిచారపారగుఁడు లో ♦ కస్తుత్యచారిత్రుఁ డ
య్యవనీపాలకులావతంసము తదీ ♦ యప్రౌఢవాగ్ధోరణుల్
సవిశేషమ్ముగ నాలకించి తమయా ♦ స్థానంబునన్ వారలం
గవితోద్యోగ మొసంగి చేకొనియె స ♦ త్కారమ్ము తోరమ్ముగన్.

క. తదుపరివృత్తాంతమ్ముం
జదువరు లప్రస్తుతప్ర ♦ శంసవలనఁ గొం
త దెలిసి యుందురు శేషము
విదితమ్ముగ నిపుడు దీన ♦ వివరింపఁ బడున్. 86

చ. అలఘుకవిత్వతత్వవిభ ♦ వాతిశయంబునఁ జేసి రామకృ
ష్ణులు కవికాంక్ష్యమాణపద ♦ శోభితులై విలసిల్లుచుండ స
వ్వలఁ జెళపిళ్లవేంకట,ది ♦ వాకరతిర్పతి,శాస్త్రు లిర్వురున్
గలఁ గవహింపఁజొచ్చిరి ప్రి ♦ కామముఁ గామవిఘాతభీతులై 87

చ. తిరుపతిశాస్త్రి యొక్కయెడఁ ♦ దృష్టివహించినయట్టిఁ డింతకున్
గఱకులవాఁడె కాని యొక ♦ కార్య మెఱుంగనిగోల; వేంకటే
శ్వరుఁ డన నాంధ్రదేశికద ♦ శాపరితృప్తుఁడు గామిఁ గార్యపుం
దెరువును గోరువాఁ డగుట ♦ దెప్పరమయ్యె భరంబు తద్ధృదిన్.

చ. కడియపుటూర మాపితలు ♦ కాఁపుర ముండిరి; యద్ది మీఁదునే
ల్బడిఁ దగుసట్టిగ్రామ మని ♦ బాదరకల్పముఁ బల్కి వేంకటే
శుఁడు కవిలోకభోజుఁ డగు ♦ సూర్యనృపాలుని గొల్వ నెంచువాఁ
డడలెను రామకృష్ణకవు ♦ లడ్డమువచ్చి రటంచు నాత్మలోన్.89

ఉ. కైతకు నేమి నర్సకవి ♦ కాఁకరపర్తికిఁ బోయి సంస్కృతా
ధీతి యొనర్చెఁ గాని నెఱ ♦ తెల్గునఁ బాండితి కొద్ది; గోష్ఠిలో
భీతుఁ డటందు; రాబుధుని ♦ పేరుగ వేంకటశాస్త్రి కెన్నియో
రీతులుగా నహర్దివము ♦ రేఁగు మదిన్ నువుగింజకోరికల్. 90

ఉ. కాఁకరపఱ్ఱుగ్రామమునఁ ♦ గౌముదిఁ బట్టినమీఁద నింటికిన్
బోకఘటిల్ల రామకవి, ♦ పూనిక నింతయు నంతరాయముం
జేకొన రోసి, పంజరముఁ ♦ జేరిన చెళ్పిళవేంకటేశ్వరా
ఖ్యాకునితో నెటో చదివెఁ ♦ గౌముది నిర్వదినాల్గుపత్త్రిముల్.91

ఉ. పూయపుఁగబ్బ మల్లెడున ♦ మర్థత యున్నదిగాని చక్కఁ శా
స్త్రీయము లైనసారములు ♦ చెప్పఁగ నేరఁడు వేంకటేశ్వరుం
డీయనసాహితీమహిమ ♦ మిట్టిద తొల్లి యొకప్డు సూర్యనా
రాయణశాస్త్రి యష్టుడుము ♦ రాతికృతిన్ వివరింప నోడఁడే. 92

ఉ. న్యాయమునందువ్యాకరణ ♦ మందును మంచిప్రసిద్ధుఁడౌనుపా
ధ్యాయుని గాశినాథగిరిఁ ♦ దాఁకి పురాణమువారిసూర్యనా
రాయణతీర్థుఁ డీతని స ♦ హాయుఁడుగా గురుడంచు నాడెఁగా
నీ యొకముక్కపీరికడ ♦ నిక్కముగాఁ బఠియించి చెప్పెనే. 93

ఉ. నాగురుఁ డంచుఁ జెప్పినఘ ♦ నంబని యెంచెడువాఁడు ; తిట్లకున్
లోఁగినవాఁడు ; నింగిలిషు ♦ లోఁగడతేరనివాఁడు నాఁగ నీ
మూగురుదక్క దైవముఖ ♦ ముం బరికించుచు వీరితోనితి
శ్రీగఁ బఠించినాఁడ నను ♦ శిష్యుఁ డొకండును లేఁడు చూడఁగన్.

చ. ఒకతఱి రామకృష్ణకవు ♦ లొద్దకు వేంకటశాస్త్రి చూడ ను
త్సుకుఁడునుబోలెవచ్చి ‘‘ తగు ♦ చోటననుం గొని మీగురుండుగాఁ
బ్రకటన సేయఁగోరెద భ ♦ వద్గురుతాపదలబ్ధి నాకుఁ
గొం డొకయుపకారమామతిలె ♦ దున్ భవదీయనృపాలసన్నిధిన్.

క. ఏమాత్రంబో వేంకట
రామకవి యొకప్పు డింజ ♦ రమ్మను నస్మ
ద్గ్రామమునఁ జదివె నాతో
నీమెయి గురుఁ డనఁగ వచ్చు ♦ నీతఁడు నన్నున్. 99

క. నాకడఁ జదివినయాతఁడు
గాకున్నను బెద్దవాఁడఁ ♦ గావున నన్నున్
శ్రీకృష్ణకవియు గురుఁడుగఁ
జేకొన వలయున్ యశమ్ముఁ ♦ జెలఁగు నతనికిన్. 97

ఉ. వేదులవారిశిష్యుఁ డయి ♦ వెల్గెనునాపితతండ్రితండ్రికిన్
సోదరుఁ డైనసర్పకవి ♦ శూరుఁ డదేనభిమాన మింత నా
మీఁదను జూపి చుట్టఱిక ♦ మేని గణించి ననుం గురుండు నా
రాదొకొ వేదులాన్వయశ ♦ రద్విధుపూర్తికిఁ గృష్ణమూర్తికిన్.

ఉ. వేసవికాల మేగుడును ♦ వెండియు నే మరుడెంతు మింతలో
మాసడి మీనృపాలునిస ♦ మక్షమునందుఁ బ్రసంగమార్గముం
జేసి వచింపుఁ డేను నృప ♦ శేఖరుదర్శన మబ్బ యత్నముల్
చేసెద నంచుఁ జెల్మిమెయిఁ ♦ జెప్పెను దత్సమయోచితంబుగన్.

ఉ. మంచిది ! వేంకటేశ్వరుఁడు ♦ మాకు గురుం డని పల్కు మీకులా
భించెడిదున్న నల్లె కలి ♦ పించెద మంచు వచించి యాతనిం
బంచిరి రామకృష్ణు లటు ♦ ప్రాప్తమనోరథుఁ డౌట నాతఁడిం
చించుక సంతసంపడియు ♦ నీసును వీడఁడు లేశమేనియున్. 100

క. వ్యాసాభ్యుదయాదికమును
వ్రాసినతఱి రాఁడు గురుత ♦ వడయఁగ; నపు డే
యాసయును జూపఁ డిపు డీ
వేషము వేయింపఁ దత్త్వ ♦ వేత్తలు నగరే. 101

వింజరపర్వము. 5

క. వింజరము ప్రథితవిద్వ
త్కుంజర మని తొల్లి పేరుఁ ♦ గొన్నది సుశ్రీ
లం జెలఁగునదియె వేశ్యా
పంజరమన నయ్యెఁ గాల ♦ పరిణామమున్. 102

సీ. వెలయాండ్ర ననురక్తి ♦ గలయాండ్రుగా నమ్మి
యర్థమ్ముఁ గోల్పోయి ♦ నట్టివారు
నోడ లెరుంగక పందె ♦ మొడ్డిజూదం బాడి
యప్పులపాలైన ♦ యట్టివారు

నహి ఫేనధూమదం ♦ డాదుల సేవించి
యుపగతభాగ్యులై ♦ నట్టివారు
నన్యోన్యమును దిట్టు ♦ లాడి రచ్చల కెక్కి
యైశ్వర్యహీను లై ♦ నట్టివారు
గీ. తెలివిదేటలు లేక వ ♦ ర్తించువారు
పరువుమరియాదలను వీడి ♦ తిరుగువారు
పాచకులు యాచకులు నీళ్లు ♦ మోచువారుఁ
గలరు కొందఱు వింజర ♦ గ్రామందు. 103

ఆ. వె. కడుపు చించి కంచు ♦ కాఁగడా ల్వెలిఁగించి
కనిన నక్షరమ్ము ♦ గానరాని
శుంఠ లెల్ల నొక్క ♦ చోఁ గూడి వాదింత్రు
తలకుఁ దగనివిషయ ♦ ములను గుఱిచి. 104

ఆ. వె. మొదలు తుదయు ముక్కు ♦ మొగమును దెలియని
వార లేడ ? విబుధ ♦ వాద మేడ ?
కుడిచి కూరుచుండి ♦ గోళ్లను మీటుచుఁ
బెద్దకుండ కెసరుఁ ♦ బెట్టుచుంద్రు. 105

క. మణులవలెఁ గానఁబడినను
గుణహీనులు సంకరులును ♦ గొందఱు విద్వ
ద్గణము నధిక్షేపింపం
గణఁగుదురు పరాత్మభావ ♦ గౌరవశూన్యుల్, 106

ఉ. సారవిచారశీలు రయి ♦ సర్వవిధమ్ములఁ దొంటికీర్తిం
గూరుపఁగాఁ బ్రియత్నములు ♦ గొల్పుచు వింజరమందు మేల్మిబం
గారమువంటిన్యాయపథ ♦ గాములు కొందఱు నేఁడుఁగూడ నై
వాఱుచు నున్నవారు గుణ ♦ బంధువిరోధుల మందలించుచున్. 107

సీ. రామడుగులవంశ ♦ రత్నంబు వేదవి
దగ్రేసరుండు సు ♦ బ్బావధాని
సంస్కృతవాఙ్మయా ♦ సక్తుండు సాత్త్వికా
హారుండు పాలంకి ♦ పేరుశర్మ
హితమితసత్యభాషి ♦ తభూషితాచారుఁ
డల్లమరాజు సీ ♦ తయ్యగారు
దాంతస్వభావు లై ♦ ధర్మవైద్యము సేయు
దొడ్డభిషక్కులు ♦ దుడ్డువారు
గీ. మఱియుఁ గొందఱు ఘనులు దు ♦ ర్మార్గములను
జేయువారికి హితమును ♦ జెప్పఁ జూతు
రక్కటా! నేఁటి యాకతా ♦ యలకు వారి
మంచిమాటలు వీనుల ♦ కించు నొక్కొ? 108

గీ. అట్టివింజరమునఁ జెర్వు ♦ గట్టుదరిని
బెంకుటిలు గట్టుకొనియుండె ♦ వేంకటేశుఁ
డద్భుతమ్ముగ నాగ్రామ ♦ మందె వెలసె
విశ్వ మెఱిఁగినయీశ్వర ♦ వేరుగాథ. 109

మీసాలపర్వము. 6

గీ. గీరతకవీశ్వరుఁడు శేష ♦ గిరినివాసుఁ
బిలిచి మాపయిఁ గొండెముల్ ♦ వలికెఁ గాన
వానినే మేముఁ దగవరి ♦ గా నొనర్చి
నిక్క మెఱిఁగించు టుత్తమ ♦ నీతి గాదె. 110

క. మీసాలపద్యమును మే
మీసామింగూర్చి పలుక ♦ మియ్యది తనపైఁ
దోఁచికొని యతఁడు మాకుం
దోసముఁగల్పించు నేమి ♦ దుండగమొ హరీ! 111

శా. “ప్రాసంబుల్ యతి” యంచునాదిపదముం ♦ బ్రారంభముం జేయుటల్
“మీాసంబుల్ వడి” యంచుఁ బైపదము ని♦ర్మింపంబడెం గేవల
ప్రాసార్థాన్వయపూరణమ్మునకు, నా♦పద్యమ్ము వెంకయ్యకుం
బ్రాసం బౌనని యే రెఱుంగుదురు ని♦ష్పక్షంబుగాఁ జెప్పవే? 112

గీ. శతవధానమ్ము సల్పెడు ♦ సమయమందుఁ
గుకవివర్ణన మెవ్వరో ♦ కోరుకొనఁగ
నాశువునఁ జెప్పినట్టిప ♦ ద్యమిది దీని
నితనిపైఁ జెప్పలేదు మే ♦ మింత నిజము. 113

క. గుణ మున్నఁ బొగడుదురు, దు
ర్గుణ మున్నం దెగడుదురు న ♦ రుల్ దీనికి ని
ర్గుణుఁ డలుగ నేమిటికో? స
ద్గుణుఁ డెలమిం జెందనేటి ♦ కో తెలియదుగా. 114

శా. దేవీభాగవతమ్ము బూతనుచు నెం ♦ దే మేము తిట్టంగ లే
దో విన్నాణపు వెంకటేశ్వరుఁడ! యె♦ట్లూఁకొట్టుచున్నాఁడవో
మా వెంకయ్యకవిత్వపద్ధతిఁ బరా ♦ మర్శించి బూతంటి మీా
భావం బాతనితోడఁ జెప్పఁగవవే ♦ ప్రార్థింతు మెంతేనియున్. 115

గీ. పరుల “నీఁకలఁ బీకెడుపా ♦ క” మనుచు
నింక నేమేమొ యంచుని ♦ రంకుశగతిఁ
దొలుదొలుత నీచభాషణ ♦ మ్ములను బలికి
వెక్కిరించుట తగునయ్య ♦ వేంకటేశ! 116

శా. దేవుం డన్నను, దేశికుం డనిన, భ♦క్తిం జేయుచున్నట్టిమా
కీ వేమేనియు లోపముం బలుకతే♦వెప్పట్ల; నీయర్చకే
సేవల్ సేయుచు నుండువృద్ధకవులన్ ♦ శిక్షింపు మింకేనియున్
మీావీవాదము మానుకొండనుచు సా♦మీా! వేంకటేశప్రభూ! 117

గీ. జ్ఞాని యొక్కఁడు తనయంఘ్రి♦ గ్రామదేవ
తపయి నిడి నిద్రవోవఁద♦ద్వారమును స
హింపఁజాలక కాలుదీ♦యింపు మనుచు
నామె పూజరినే మొత్తె♦ననఁగ వినవె? 118

పునరుక్తిపర్వము. 7

గీ. చాటుపద్యము లెద్దానిఁ♦ జాటి తెలిపె
శృంగభంగమునం దెద్ది♦ చెప్పఁబడియె
సత్యసందేశమును దేని♦సంప్రతించె
నదియె వివరింపవలసె భం♦గ్యంతరమున. 119

ఉ. ఆశుకవిత్వసంపద జ♦యంబు వహింతుము మీకు శాబ్దమం
దాశ వహింపఁగా వలవ♦దద్భుత మైనశతావధానఘం
టాశతకర్తృలన్ మిము న♦డంచెద మిట్టటులాడనేల యే
దేశము మాకు సమ్మతమొ♦ తియ్యనివాక్కలహంబు సేయఁగన్.

గీ. "రాను రప్పింపఁ బని గాన♦రా" దనునెడ
రానుశబ్దమ్మునకు మేము♦ రాననంగ
నర్థ మొనరించుకొనఁ దగు♦నయ్య! మీరు
రాను రప్పింప మనికదా♦దానితీరు. 121

ఆ. పాలఱాళ్లు పిఱికి♦పందలు ముదినేతి
బీఱకాయ లనఁగ♦మీరె గాక
యొరుల కెట్లు సెల్లుఁ♦బరికించుకొనరాదె?
యేము కామి లోక♦మే యెఱుంగు. 122

ఉ. తా నొకపాటిపేరు గల♦తజ్జ్ఞుఁడ నంచు నొకండు, మేటిసం
స్థానమునం గవీశ్వరప♦దంబునఁ బొల్చెడువారిఁ బిల్చుఁ గ

వ్యాసకుఁ; గాక తాళము గ♦నైన యెడం జయమౌను; గానిచో
వానియథాస్థితమ్మనకు♦వంచన లేదుగదా యొకింతయున్. 123

ఉ. క్రిందుగ నున్నవాఁడు పయి♦కిన్ నెగయం దెగియించునాత్మలోఁ
దందర గల్గియుం దనక♦థస్థితి సిద్ధమె కాన; నున్నతిం
బొందినవాఁడు యద్భవిత్రు♦పోలిక నుడ్డయనంబు సేయఁగా
నందియమందు నైజబల♦సంపదఁ బ్రీత్యయ మెంతగల్గినన్.124

క. ‘సమశీలోద్యోగులకున్
సమవిజ్ఞానులకు సమను♦చారిత్రులకున్
దమలో సఖ్యమును వివా
దముఁ దగు’ నని వ్యాసభార♦తమ్మన లేదే. 125

ఉ. దూసినకత్తి సూతునిసు♦తుం డెటనుండియొ వచ్చి దుర్బలా
శ్వాసనిబంధనమ్మలను♦వల్కుకు మంచు వృథాప్రగల్భముల్
సేసి కిరీటిఁ బోరునకుఁ♦జీరఁ గృపుం డెటులాడె? రాజరా
జానడిఁ దీర్చుపొంచె గద♦యంగవిభుం బొనరించెఁ గర్ణునిన్. 126

చ. కలహము సేయఁగాఁ దమకుఁ♦గారని తోఁచుటఁగాదె కేరుచున్
బిలిచినఁ విప్రపుంగవుల♦మీఁదికిఁ బోవక పాణినీయమున్
దెలియరు సంస్కృతమ్మను మ♦థింపరు వా రని వట్టిసాకులన్
బలికిరి తారు తుల్యపద♦భాగులె మేమెన రేఁగి తాఁకఁగన్. 127

శా. ఈశైలిన్ నయమార్గ ముండినను మే♦మెన్నండు నే నిట్టియు
ద్దేశమ్ముం గయికోము పాసుభటవృ♦త్తిం జక్కఁగా సత్యసం
దేశంబే వచియించుఁ దద్విషయకో♦క్తిన్ జల్లఁగా గీరతా
భ్యాశ మ్మందు గుదించి దానిఘటియిం♦పం బోమియే తెల్పెదున్.

## రామపర్వము ౮.

గీ. మనకు వేంకటశాస్త్రి సం♦బంధి యతఁడు
శిష్యులని చెప్పుకొనుచు దూ♦షించినంత
మాత్రమున నేమిలోపము♦మనకుఁ గలుగు?
శాంతము వహింపఁగదవయ్య ♦ యింత కృష్ణ. 129

సీ. పండితు లానంద ♦ భరితులు గా రాజ
సభలోన నవధాన♦శక్తిఁ జూపి
ప్రతిభావిశేషసౌ♦భాగ్యంబు వెల్లడి
పడఁగ నాశువునఁ గ♦బ్బములు సెప్పి
వినువారిచెవులకు♦విందుగా మృదుపదం
బులుగూర్చి సత్కావ్య ♦ ముల నొనర్చి
బుద్ధివికాసంబు♦పొలుపొందఁగా శత
పాసాదిచిత్రమా ♦ ర్గములు ద్రొక్కి

గీ. వన్నెఁగాంచితి వింక నె♦వ్వార లేమి
యనిన నీఖ్యాతి కేమియు ♦ హాని రాదు
వారియసహనమే యెల్ల ♦ వారలకును
గ్రిమముగాఁ దెల్లమగు నమ్మ♦ గదవె కృష్ణ! 130

ఉ. తిట్టినఁ దిట్టనిమ్ము; కవి♦ధీరుఁడ నేనె యటంచు డంబముల్
గొట్టినఁ గొట్టనిమ్ము; బుధ♦లోకము మెచ్చ సభాస్థలమ్ములన్
దట్టుఁడవై నిరర్గళసు♦ధారసధారలు జాలుకొల్పు ని
న్నిట్టిఁ డెదిర్చి నిల్వఁగలఁ♦డే? వల దింతటిపట్టుఁ బట్టఁగన్. 131

ఉ. ఈతనితోడ వాదమున ♦ కేగక యుండిన మాత్ర, నే యప
ఖ్యాతియుఁ గల్గ; దేగి జయ♦మందిన దాన నొకించుకేనియున్

ఖ్యాతియుఁ గల్గ; దేటికిఁ బ్రి♦యాసముఁ జెందెదు నీకుఁ గల్గువి
ద్యాతిశయమ్ము నిట్టిపని♦కా వినియోగము సేయఁ జూచుటల్.

శా. సాకల్యమ్ముగ నాదుపల్కు విను కృ♦ష్ణా! వారు నిన్నెన్నఁదున్
డీకోనేరరు సత్సభాముఖమునన్ ♦ డీకొందురే నెవ్వరో
సాకుల్ వన్ని వృథాప్రగల్భవచనా ♦ శ్వాసంబులం జేయుచున్
దోఁక ల్లుద్ధరు గాని యుక్తముగ వా♦దున్ జేయఁగా నేర్తురే?

చ. ఎఱుఁగవఁటోయి! నే నుడువ♦నేల దురాగ్రహవృత్తి వేంకటే
శ్వరునకు సాజ; మాతనియ♦శంబున కంతకు మూల మద్దియే.
వెరవరివోలె నెంతటివి♦వేకులనేని యెదుర్చునట్లుగాఁ
బరువిడుఁ గ్రిందఁబడ్డఁ బయిఁ♦బడ్డ తెఱంగునఁ బల్కుడంబముల్.

క. మధునాపంతుల సూరయ
బుధు నే నెదొ ఱూడ నతఁడు♦పొక్కుచుఁ దన కా
విధ మెఱిగించె నటం చొక
కథఁ బన్నెను గంటె యెంత ♦ కల్పకుఁడో గదా? 135

ఉ. సూరయగారు చెప్పిరను♦చున్ లిఖియించినపొల్లువ్రాఁత ని
స్సారమె కాక సర్వము న♦సత్యము. పాప! మతండు నాయెడన్
గూరిమి జూపువాఁ డిటులు ♦ కుత్సితకల్పన మేల సేయు న
య్యారె! గతాసుఁడైనమహి♦తాత్మునిపై నెపమూఁదఁబాడియే!

ఉ. చచ్చినవారు చెప్పి రన ♦ సాక్ష్యము లక్కఱలేదు; చేతికిన్
వచ్చినయట్టు లేదయిన ♦ వ్రాయఁగవచ్చు; నదంతయున్ నిజం
బచ్చుపడంగ వ్రాసితి న♦టంచును లోకుల మోసపుచ్చఁగా
వచ్చుఁ; బ్రతిష్ఠఁ గైకొనఁగ♦వచ్చుఁ బరంబున కాస లేనిచోన్.

సీ. శ్రీనివాసాచార్యుఁ • జెనకి కయ్యముఁ దెచ్చెఁ
గాశినాథునిమీఁదఁ • గత్తిగట్టెఁ
బురుషోత్తమునితోడఁ • బోరాటముం బెంచె
రామరాయనిపైకి • రథముఁ దోలె
భుజగరాయనికూర్మి పోఁ • గొట్టుకొనె; సుమా
కాంతుతో నేమేమొ • కఱకఱ లాడె
పాడివేంకటసామి • పాలితోఁ గలహించెఁ
గోపరింపుగవుల డీ • కొనఁగ రేఁపె

గీ. వ్రాసె శృంగారకవి సర్వ • రాయుతోడ
మఱియు నెందఱెందఱితోనొ • మచ్చరించెఁ
దిట్టెఁ బెక్కండ్ర నన్యాప • దేశముగను
గోప మితనికి నెపుడు • ముక్కుతుద నుండు. 138

ఆ. వారివారిమాట • వచియింపఁగా నేల?
కలుషమనక మూఁడు • కాళ్లముసలి
యైనతండ్రిమీఁద • నాగ్రహముం బూని
యిల్లు వెలిచెనంట • యీఘనుండు. 139

మ. “అతిదారిద్ర్యవశంవదుండ నయి యా • యావృత్తులం జేసి యే
గతినో కాలముఁ గొంతఁ బుచ్చితిని నా • కష్టమ్ముగట్టెక్కమ
త్సుతుఁడొక్కింత ప్రయోజకుండగుట” నం • చుం గ్రుక్కెళుల్ గ్రమ్మఁగుత
త్పిత కిప్పాటు ఘటిల్లె ముప్పాతుదఁ బు • త్రీగేహముం జేరఁగన్.

ఆ. పాపవల్లరులకుఁ • బ్రాకుడుచెట్టైన
కలియుగం బదిట్లు • కాలఁబట్టి
యకట! యేకపుత్త్రి • యైనయీవృద్ధుండు
చివరఁ గూఁతునిల్లు • చేరవలసె. 141

క. పడకుచుఁ గాల్సేతులు తడఁ
బడగా "నేనాము"చుట్టు ♦ పట్టులయం దీ
తఁడు నేఁడుఁ గానువీసపు
గడనకుఁ దిరుగునఁట యేమి ♦ కర్మంబొకదే? 142

క. నెలనెలకు నించుకించుక
గొలబత్తెముఁ గొడుకొసంగఁ ♦ గూటికినిఁ గు
డ్డలకును జాలక యాతఁడు
కలకాలము నిట్టిపాట్ల గన ♦ వలయు నొకో? 143

చ. జనకుఁడు ఘోరవార్ధకద ♦ శం గొలబత్తెముఁ గొంచు
నేకపుత్రుని దను వీడి దై ♦ న్యమునఁదూఁగుచు నల్లునియిల్లు సేరె;నీ
తనిగురుభక్తి ధర్మనిర ♦ తత్వనిరాగ్రహవృత్తు లింక నే
మనివచియింపనేర్తు: నక ♦ టా యిదియే యుగధర్మ మౌనొకో. 144

గీ. ఇట్టిసుచరిత్రములు గల ♦ యీమహాత్ముఁ
డీసదాచారుఁ డీప్రాజ్ఞుఁ ♦ డీప్రబుద్ధుఁ
డీపితృప్రియుఁ డీభువ ♦ నైకగురువు
తగుదు నని ధర్మపన్నముల్ ♦ దడవు నిపుడు. 145

ఉ. కాలమునంతయుం గలహ ♦ కావ్యము సేయనె పుచ్చ కెప్పుడో
వీలయినప్డు హేళగ నె ♦ వే రచియింతువు నీవు కొన్నిప
ద్యాలను; వానికేళ్లఁ బడి ♦ నాతఁడు పెక్కులు వ్రాసియైన నాం
దోలనమందుఁ గాని పరి ♦ తుష్టి వహింపఁ డొకింతయేనియున్. 146

శా. తిట్టుంబోతగు నొక్కరాగకుని బు ♦ ద్ధింజెప్పఁగాఁ బూని మున్
దిట్టం డొక్కఁడు మధ్యమధ్యమున నే ♦ దే నాడుచున్ దాని రా
కొట్టంగా నది తిట్టి నోరువడఁ గొం ♦ కుల్ వోవఁగాఁ జేతు లిం
కెట్టుం జేయఁగలేక తిన్నఁబడె నం ♦ డ్రీ విట్లు గావింతువో? 147

## కృష్ణపర్వము 9.

క. గెలిచిన నోడినఁ దనకుఁ
వెలితి గనంబడకయుండ ♦ వేంకటకవి యొ
చ్చెల! నిన్ను శిష్యుఁడా యని
చెలికారముఁ గలుపు ♦ నేమి చెప్పెదు బావా! 148

చ. గురుఁడ నటంచు మాటికిని ♦ గుద్దుకొనం, గనువారు పాపమీ
నరసుఁడు రిత్త నిట్టులు వి♦చారముఁ జెందఁడు, కాన దీనిలో
నరయఁగఁ జాలభాగము య♦థార్థము గల్గకపోదటంచు నెం
తు రదియ చాలు నంచుఁ బడి♦దొర్లెదు వేంకటశాస్త్రిఁ జూచితే?

సీ. ఎట్లొ చదివితి మూన్నాళ్లు ♦ పట్టపవలు
పట్టుమని రెండుముక్కలు ♦ పలుకకున్నఁ
దిరుగఁ డిఁక నెన్ని సెప్పిన ♦ గురుఁడ ననుచుఁ
దగులుకొన్నాఁడు నిన్ను పై♦ తానులాగు. 150

ఉ. తా నొకచోట నీకు నవ♦ధానపుపద్ధతియుం గవిత్వసం
ధానము నేర్పినాఁడనని ♦ తన్నుకొనుఁ మఱి యొక్కచోట నిం
తేనియు నేర వీ వనుచుఁ ♦ దిట్టు రుషాముషితాంతరాత్ముఁడై
చేనికి సంతసింతురు త♦దీయకవిత్వవిచారపారగుల్. 151

సీ. సూక్ష్మదృష్టికి మననింద ♦ సూచితముగఁ
గొప్పరపువారిఁ గొండాడి ♦ గొప్పఁజేసి
చివర కేమియు నెఱుఁగరి♦సీ! యనఁ డొకొ
చప్పటులపర్వ మింకొక ♦ సారి జరుగ. 152

చ. తనకు నసూయ లేదనిగ ♦ దా వచియించు నితండు లేకపో
యిన యెడ నెవ్వఁడో గుణవి ♦ హీనుఁడు సెప్పినకల్లకొండెముల్

విని యవి యూఁతగాఁ గొని వి♦వేకము గాడ్పడ లేనిపోనితం
పి నిటులు మాటిమాటికిని ♦ బెంచుచు నుండఁగ నేల చెప్పవే! 153

చ. గురువులఁ గప్పిపుచ్చుటను ♦ గొప్పవహింపఁదలంచి సూనృతే
తరవచనమ్ము లాడుచుఁ గృ♦తఘ్నతఁ జూపితివేని వేంకటే
శ్వరుకడఁ గొన్నిమాసములు♦ఛాత్రుఁడ వైనవు డామహాత్ముఁడే
కఱపినవిద్య యద్ది యనఁ♦గాఁ గథలున్నవి యెన్నియేనియున్.

సీ. రాజమహేంద్రవ♦రంబునం దొకచిత్ర
మైనగాథ వినంగ♦నయ్యె నద్ది
చెప్పెద నాలింపు ♦ శ్రీపాదవంశాబ్ధి
చంద్రుఁ డయినకృష్ణ ♦ శాస్త్రికడకు
నొకయనామకుఁ డెవ్వఁ♦డో వచ్చి వేంకట
శాస్త్రి మీకడ విశే♦షముగఁ జదువ
లేనట్లుగా నొక్క ♦లేఖ నాతనిపేర
దయచేసి వ్రాయుఁ డా♦తండె యిట్లు

గీ. మిమ్ముఁ గోరంగ నను బుచ్చె ♦ మీకు నిప్పు
డేమినష్టమ్ము వాటిల్లు? ♦ నిట్లు సేయఁ;
గీర్తి కా? మీరు సద్యశో♦మూర్తులె గద;
యనుచుఁ జతురతగాఁ బల్కె♦నంట యంత. 155

క. కవిరాజు, తనమనంబున
"నవురా! యి ట్లడుగఁబుచ్చె♦నటె యూతం; డే
మవివేకం బిది?" యనుకొని
ప్రవిమలగంభీరభావ ♦ భరితహృదయుఁ డై. 156

గీ. అట్లు సేయుదు నేమి య ♦ భ్యంతరమ్ము
గలదు దీనికి? వేంకట ♦ కవికిఁ జెప్పి
మీర లీవిషయమ్మును ♦ గూరిచి యొక
చీటి వ్రాయింపుఁ డాతని ♦ చే ననెనఁట. 157

ఉ. శ్రీపదకృష్ణమూర్తికవి ♦ చెంగట వేంకటశాస్త్రి సంస్కృతా
లాపములుం దెలుంగులును ♦ లక్షణముం బఠియించి మున్ దద
ఖ్యాపకతాబలమ్మునను ♦ తాఁ గవినామముఁ దాల్చెఁ బావమీ
దీప మతండు పెట్టినయ ♦ దేసుమి యాతనికిన్ నిజమ్ముగాన్.

గీ. అట్టులైనను గురుఁడంచు ♦ నతని గృతుల
నుతులు గావింపఁ డెప్పుడు ♦ నితఁడు బ్రహ్మ
గురువరుని నొక్కనినె పేరు ♦ కొనును కాని
దీనికిం గారణ మ్మేమొ ♦ తెలిసికొనుము. 159

ఉ. వ్యాకృతిఁ గొంతఁ దక్క తన ♦ కన్యమొకించుకయేని బ్రహ్మయా
ఖ్యాతుఁడు చెప్పెనే? సభల ♦ నాతనినే గురుఁడంచుఁ బల్క నే
లా? కవిరాజునిట్లువిడ ♦ నాడఁగ నేల? యతండె నేర్పెఁ గా
దా కవనమ్ము? దానినెగ ♦ దా తన కెద్దియొ పేరు సేకుఱన్. 160

క. కృతులు రచింపఁగ నేర్పిన
కృతి యుండఁగ నతనినే య ♦ కృతిప్రమభక్తిన్
నుతియింపక విడుట కృత
ఘ్నత గాదో పాతకమ్ము ♦ గాదో తనకున్. 161

క. ఏవిద్యవలనఁ దనకున్
జీవిక యేర్పడెనొ దానిఁ ♦ జెప్పినవారే
రో వివరమ్ముగ సభలో
భావింపఁగ వలదె తేట ♦ పడ నెల్లరకున్. 162

గీ. కృష్ణమూర్తి కవీంద్రుండు ♦ కేవలమ్ము
చిన్నతనమున నెద్దియో ♦ చెప్పెఁ గాని
యాంధ్రగీర్వాణములు మొద ♦ లయిన వతఁడు
సెప్పలేదని యితఁడు వ♦చించు నేని. 163

ఉ. ఎవ్వఁడు సంస్కృతమ్ము వచి♦యించెనొ యెవ్వఁడు తెల్గు సెప్పెనో
యెవ్వఁడు లక్షణమ్ము తెలిఁ♦గిట్లని నేర్పెనొ పద్యమల్లఁగా
నెవ్వఁడు దారిచూపి రచి♦యింపఁగఁ జేసెనొ యామహాత్ము నెం
దెవ్విధిఁ గొల్చె? బ్రహ్మగురుఁ♦డీవిషయమ్ము లెఱుంగఁడే కదా.

క. తనగురువులె నీపాండితి
కనుమోదముఁ జూపఁ ♦ దాను హర్షింపకపో
యినఁ బోయెఁగాక యాతని
గొనమే తెల్ల మగునీకుఁ ♦ గొఱ యేమియగున్. 165

సీ. ఆంధ్రభాషాయోష♦కవతంస మగుపీఠ
పురి కేగితివి గదా ♦ మొట్టమొదటఁ
జూచినాఁడవు గదా ♦ సూర్యావనీపాలుఁ
బాలితాఖిలబుధ ♦ జాల్కు లీల
నవధానము లొనర్చి♦యలరించితివి గదా
మున్నూటపదియార్లు ♦ ముదలవెట్టఁ
బ్రకటించితివిగదా♦పాండిత్యగరిమంబు
నాస్థానకవివిగా ♦ నాదరింప
గీ. కృతి రచించితివిగదా వి♦నుతికి నెక్కి
వేయినూటపదారులు ♦ విలువసేయఁ
దీర్ఘకాకమ్ములట్టులు ♦ దిమ్మఁదిరిగి
యేమి గడియించినారు వా♦రింతకన్న. 166

## విజయదశమీపర్వము 10.

క. పిల్లలకుఁ బప్పుబెల్లము
లల్లుర కత్తింటివిందు ♦ లట్టులు విద్వ
ద్వల్లభులకు సూర్యాధిప
తల్లజుబహుమతులు విజయ ♦ దశమి నెసంగెన్. 167

ఉ. పండితులుం, గవీంద్రులు, సు♦పాయనముల్ గొని సూర్యరాజమా
ర్తాండునిఁ జూడఁ గాకవిది♦వాంధము లెవ్వియొ యొండురెండురా
కుండిన నేమి? యెల్లరు నో♦హో యన వచ్చిరి శాంకవద్యుతుల్
కుండలదీధితుల్ గనుల♦కున్ మిఱుమిట్లులు గొల్ప నత్తఱిన్. 168

గీ. ఆంధ్రకవితాపరీక్షార్థి ♦ యై యఱగొఱ
కబ్బ మొక్కటి గైకొని ♦ కడెమునుండి
సందియము నందుచును వచ్చెఁ ♦ జళ్లపిళ్ల
చిన్నవేంకటశాస్త్రి మా ♦ యున్నబసకు. 169

క. వచ్చి యథార్థమ్ముగ మా
యిచ్చినయర్ఘ్యంబుఁ గొనుచు ♦ నెవ రడుగక యే
యొచ్చెల్ల! వేంకటేశ్వరు
కుచ్చితములఁ బల్కెఁ బూన ♦ గ్రుచ్చినరీతిన్. 170

ఉ. నన్ను విభీషణుం డనుచు♦నవ్వెన నవ్వదు రేమొ కాని మా
యన్నవిధంబు న్యాయమున♦కగ్గముగా; దతఁ డొజ్జ శ్రేయముల్
గన్నులఁ జూడలేఁడు; మముఁ♦గాంచియు నీసు వహించు; నింకనే
మున్నది! నాకు నాతనికి♦నుల్లములన్ సరిపో దొకింతయున్. 171

ఉ. ఒండ్లన నేను బాల్యమున♦నుండుటఁజేసి తనంతఁ దానె నా
పెండ్లికిఁ బెద్దయై తనకుఁ♦బ్రేముడిగల్గినసాని మేళముల్

గొండ్లికిఁ బిల్చి యప్పు నొడఁ◆గూరిచె నా; కటుమీఁద నెన్నియో
యేండ్లు శ్రమించి యాఋణము◆నీఁగితి దైవ మెఱుంగు నాగతిన్.

ఉ. నాకుఁ బితృవ్యపుత్త్రుఁ డని◆నైజవిరోధముఁ జేసి యివ్విధిన్
వాకొనుచుంట లేదుసుఁడి◆వాస్తవ మియ్యది యైనఁ గాని నేఁ
బైకిపుడేని యయ్యలఘు◆పక్షముఁ బూనక తప్ప దింతయున్
మీకడనే వచించెదను◆మీరు మఱొండుగతిం దలంచినన్. 173

క. మీకంటె వేంకటేశుఁడు
నాకెక్కుడు బాంధవుండు ◆ న్యాయపథము మీ
దాకారణమున నిఱుతెగ
కేకీభావమ్ము సేయ ◆ నిచ్చవహింతున్. 174

చ. అనుటయు వానిసత్యకథ◆నాదృతియున్ గడుసుందనంబువో
వనిజపక్షరక్తియు న◆వారిగఁ గాతుక మద్భుతంబుఁ గూ
ర్చిన; "అవునయ్య! మంచిదియొ◆చెడ్డదియో భవదగ్రజుండు తొ
క్కినగతి మీకుఁ దప్పనిది;◆గీడనలేరట మిమ్ము నెవ్వరున్. 175

ఉ. తిట్టెమొ కాని యింతకుఁ బ్ర◆తిక్రియ నొంది యెఱుంగఁడెందుమీ
కట్టెడియన్న; మమ్మురక◆కాఱులు వల్కుచు నాఱుమాసముల్
దొట్టియఖర్వగర్వమునఁ◆దూలెడు సైరణ సేయ మీపయిన్
గట్టిగఁ దత్ప్రయత్నముల◆ఖండన సేయక మాన మన్నిటన్. 176

మ. అటు కోపోద్భటమైనమానుడికిఁ దా◆నడ్డాడి యచ్చిన్న వేం
కటశాస్త్రజ్ఞుఁడు వల్కె బంధులము వా◆కాటేల? మాయన్న తే
పటనే ప్రాంచికిఁ బోవుచున్నను రయిల్◆బండ్లాగునత్తావు చెం
గటికిన్ రమ్మని జాబువ్రాసెఁ జని చ◆క్కంజేసెదన్ దన్మతిన్.

క. అని మర్నాఁ డట్టులె పో
యెను బోగబండాగుకడకు ◆ నీర్ష్యావేశ

మ్మున్న పైమెఱుఁగనియాతఁడు
వినునే యీవెఱ్ఱిచిన్న ♦ వేంకనపలుకుల్. 178

క. కవనమునఁ దనకుఁ దలఁక
ట్టవువేంకటకవికిఁ జారుఁ♦డై వచ్చెడువే.
శివరామశాస్త్రితోఁ గు
ఱ్ఱవేంకటబుధుండు వేమ♦ఱలి యరుదెంచెన్. 179

సీ. అదియేలకో? విల ♦ ఘూస్యుఁడై యటు వచ్చి
యీయన నెఱుఁగుదు ♦ రే? యితండు
మాయన్నగారి ప్రపే ♦ మంపునంతేవాసి
శివరామశాస్త్రినాఁ ♦ జెలఁగునాతఁ
డిచటియుత్సవముల ♦ నీక్షించుకోర్కెతో
నేతెంచె నని పల్కెఁ; ♦ నెఱుఁగ కేమి?
కొన్నికవితలు గై ♦ కొని వి.పి.నంపిన
యప్పు డీయనయెపో ♦ త్రిప్పివైచె

గీ. నని తలంచెద మంటి.మ ♦ ల్లంత నతఁడు
విన్నవై మీరు చిఱునామ ♦ మున్ను శతవ
ధాని యని వ్రాసి పిమ్మట ♦ దాననెఱ్ఱి
గీఁతఁ బెట్టుటచే నొల్ల ♦ నైతి ననియె. 180

చ. అటు పలుకంగ నింగ్లిషున ♦ నైదవకక్ష్యఁ బరాజితుండు కా
వుట కిదివో ఫలంబనుచుఁ ♦ బోలిచి యచ్చెరువంది «హోయి! వేం
కటకవిశిష్యుఁ డౌదు వికఁ గట్టిగ; మున్ బ్రతిమాసమందు నీ
కెటు లిఖియింపఁగాఁబడెనొ ♦ యించుకయేని తలంచిచూడవే? 181

గీ. తెలుఁగుచిఱునామ కింగ్లీషు ♦ దిద్ది క్రింద
నీటుగాఁ బోస్టుమాస్టరు ♦ గీటుగీచె

దైవవశమున నీయవ ♦ ధానిబిరుదు
మాసె నద్దాన; నిది యేరి ♦ దోసమోయి? 182

క. అని యాడితి; మాతఁడు మా
అసకదో సౌహార్దకాంక్ష ♦ యభిలాషముతోఁ
బెనఁగొన మీపద్యమ్ముల
వినుపరె విననలతు ననుచు ♦ వెండియుఁ బలికెన్. 183

క. "మాపద్దెమ్ములు నేఁడో
ఱేపో లోకమున వెలువ ♦ ఱింపంబడుఁ గృ
ష్ణాపత్త్రికలో మీకుం
జూపడుఁ దినఁబోవుచున్ రు ♦ చుల్ విననేలా?" 184

వ. అని యిట్లు. 185

గీ. మేము వచియించుటయు శివ ♦ రామశాస్త్రి
యేడకో మిత్త్రములయింటి ♦ కేఁగెఁ బిదపఁ
జిన్న వేంకటశాస్త్రియు ♦ నన్న తెఱఁగుఁ
జెప్పి లజ్జాభరమున ని ♦ శ్చేష్టుఁ డయ్యె. 186

మ. అంతన్ వేంకటశాస్త్రి తమ్మునిహితం♦బాలింప కున్మత్తుఁడై
"శాంతింపుం డని రాయబారమారా ♦ శాంతింప కేమున్నదం"
చంతస్సారము బైలుగా నెవియొ ప♦ద్యా లల్లి తన్మాత్ర, నే
సంతోషించెను రామకృష్ణకవులా♦జంజాటముల్ మెత్తురే? 187

శా. రావుల్ పీడుము వేంకటాచల! పర♦ప్రజ్ఞాసహిష్ణుత్వదు
ష్కోపాటోపదశావిశాలపరుష ♦ క్షుద్రోక్తిరూపాశుభ
వ్యాపారగ్లపితప్రపంచకుకవి ♦ ప్రాగల్భ్యనిర్మూలన
వ్యాపృత్యుగ్రులు రామకృష్ణులును నీ♦పాండిత్యముల్ మెత్తురే?

శా. డంబాల్మానుము తిర్పతిద్విజ! వరి ♦ ష్ఠత్వాభిమానోచ్ఛ్రికే
ర్జంబాలాంతరమగ్నభగ్నకుకవీ ♦ శానావలంబప్రథా
స్తంభచ్ఛేదనబద్ధకంకణవచ ♦ శ్శస్త్రప్రగల్భార్భటీ
సంబంధాఢ్యులు రామకృష్ణులును నీ ♦ ఝుంకారముల్ సైతురే?

మ. అలఁతం జెందకు వేంకటాచలమ! హే ♦ యాఖ్యానదుష్కల్పనా
విలనిస్సారనికృష్టకావ్యరచనా ♦ భివ్యక్తమాత్సర్యతుం
దిలవై ధేయతమోవిమోచనకళా ♦ దీవ్యద్వచఃకాంతిపు
ష్కలసచ్ఛంద్రులు రామకృష్ణులకు నీ ♦ సంరంభముల్లెక్కయే? 190

శా. రంతుల్ సేయకు తిర్పతిద్విజుఁడ? పో ♦ రణ్మాఱుగా దార్యులో
కాంతస్తోమకరప్రసాదమధుర ♦ వ్యాహారమాహాత్మ్యవి
భ్రాంతస్వాంతవిరోధిపండితకవి ♦ ప్రారబ్ధదుష్కల్పనా
తంతూచ్ఛేదకరామకృష్ణవిబుధ ♦ ద్వంద్వమ్ముతో వాదముల్. 191

శా. ఆశాపాశముఁ ద్రెంపరైతిరి వృథా ♦ హంకారహుంకారముల్
లేశంబేనియు వీడరైతి రఘువ ♦ ల్లీమూలవిచ్ఛేదన
క్లేశం బింతయుఁ బూనరైతి రనృతో ♦ క్తిన్మానలేరైతిరా
వేశంబున్ విడరైతి రించుకయుమీ ♦ వేత్తృత్వ మింతేకదా? 192

మ. అపవాదమ్ములు పెక్కు లాడితి రసూ ♦ యాదాసులై యెన్నియో
విపరీతమ్ము లొనర్పఁ జూచితిరి మా ♦ ద్వేషమ్ములం బూని మా
నృపచూడామణిచిత్తవృత్తి నెటులే ♦ నిం ద్రిప్పఁగా నెన్నొ కా
నిపనుల్ సేయఁగ సాహసించితిరి శాం ♦ తిం జెందుఁ డింకేటికిన్.

క. అగ్గివలె మండుచున్ మా
కెగ్గులు దలఁచినవిపక్షు ♦ లింతకె మిగులన్
సిగ్గువడి తారె తమలో
మ్రగ్గుచునున్నారు విగత ♦ మానసు లగుచున్. 194

## సమాప్తిపర్వము. 11

గీ. అప్పు డనుట యసత్యంబగు ♦ యయ్యెఁ గాని
యిప్డు నిజముగనే వచి ♦ యించుచుంటి
మేమి సేయంగనోపుదు ♦ రేము మీకు
వినుఁడు ముమ్మూర్తి కీశ్వర ♦ వేర్లమునుఁడీ. 195

ఉ. బెండ్లమొ గుండ్లమో ఘనక ♦ విప్రకరంబున మీకుమాత్రఁ మె
న్నేండ్లకునైన మేమెనుఁడి ♦ యీశ్వరవేఱుల మాదు మూరకే
గొండ్లియొనర్పఁబోవకుఁడు ♦ కొంకక నోరికొలందులాడినం
బండ్లను రాలు; సిగ్గిలక ♦ పగ్గెలువోయిన నూఁడు మీసలున్. 196

ఉ. కూఁతలు గూసి పేరుఁ గొనఁ ♦ గోరికపుట్టినదేమొకాని నీ
చేఁతలు సాగిరావుసుమి ♦ చిత్తమునం దలపోసికొమ్ము వి
ద్యాతిశయమ్ము గల్గినమ ♦ హాత్ములఁ గాకరపర్తిశాస్త్రులన్
గోఁతు లటంచు వ్రాసితివి ♦ కూడదు నీ కిది వేంకటాచలా? 197

చ. తరములనుండి మాకుఁ ♦ గడుదగ్గఱిచుట్టమ వీవు నీదుచు
ట్టఱికముచేనె మాకును స్ఫు ♦ టంబుగ నిందలు గట్టఁ బాత్రులై
పరఁగినధూర్తశేఖరులు ♦ పాచకయాచకచక్రవర్తు లెం
దఱో గల రేల నీ వురక ♦ దప్పుల కేగెదు నవ్వులాటకున్. 198

క. తనభావుకుమంగలవ
ర్తనమును దనమేలుబ్రతుకుఁ ♦ దలపోయవు కి
ట్టనివార లేవో సెప్పట
యును జంకలువైచుకొందు ♦ వుడుకుంబోతా! 199

గీ. గుఱునిచెంగటఁ బెండిలి ♦ కొఱకు నప్పఁ
గొనుచు మసనపుగుడ్డను ♦ గుడువ యిడుట,

దాన నూటసాక్షిగనుంట, ♦ తప్పుగాక;
యీసుగలవారియాడిక ♦ దోస మగునె? 200

గీ. లంజ యన లక్ష్మి యనెదవే? ♦ లక్ష్మిమగఁడు
తల్లికి మగండఁటే? యెంత ♦ దారుణుఁడవు!
విష్ణుదేవునిఁ దిట్టిన ♦ వేంకటేశు
దూఱినట్టులు గాదొకో ♦ దోసకారి. 201

ఆ. గీ. వ్యాజనింద్యయన్న ♦ వాజమాటలు గావు
పలుగుపోకలెల్లఁ ♦ బనికిరావు
చేతవాతఁ గాని ♦ సిగ్గిడివ్రాఁతలు
వ్రాయ కూరకున్న ♦ వట్ట మేమి? 202

గీ. చింత దీఱఁగ వ్రాసికొ ♦ మ్మంతె కాని
మమ్ముఁ దిట్టంగఁబోకు వై ♦ రమ్ము గల్గు
చోటఁ దిట్టినఁ బ్రియ మున్న ♦ చోటఁ దగులు
నన్నసత్యోక్తి నెఱుఁగవో ♦ యన్న! నీవు. 203

ఆ. వె. ముఱికికుంటలోన ♦ నెఱుఁగమి నెవరేని
జాలురువ్వ సైప ♦ రానికంపు
బయలువెడలుఁగాని ♦ పరిమళ మొలయునే
కాన కేము నిన్నుఁ ♦ గదిపినాము. 204

గీ. అడుగుదువ సూరిజనహృద ♦ యమ్ముఁ గోరి
యీవు నీయంత వ్రాసిన ♦ హేయలేఖ
లెట్టి వని చెప్పెదము గాక ♦ కట్ట! నీవు
వట్టికొడిమెలు గట్టనె ♦ వ్రాతికి నెఱుక. 205

ఉ. లంజను “లంజ!” యన్న నది ♦ లాతుల పైఁ బడి మీఱలందఱున్
లంజలె మాదుబంధుగులు ♦ లంజలె ముజ్జగమందు నెల్లరున్

లంజవె యంచు దిట్టునను ♦ నానుడి నిక్కము గాఁగ నీవు మ
మ్ముం జలపట్టి యేవియొ య♦పూర్వము లాడుదువంచెఱుంగ మే?

సీ. సుప్రశస్తం బైన ♦ చూతవాటికయందు
విషభూరుహం బుద్భ ♦ వించినట్లు
బహురత్నమౌక్తిక ♦ ప్రభవ మౌనబ్ధిలో
గులకఱాయియొకండు ♦ గలిగినట్లు
స్వచ్ఛ మైతనరారు ♦ చంద్రబింబమునందు
నడుమ నల్లనిమచ్చ ♦ వొడమినట్లు
ఫలపుష్పభరిత మై ♦ పరఁగుకాననమునఁ
దీక్ష్ణదావం బుప్ప ♦ తిల్లినట్లు

గీ. ఎన్నివిధములనో వన్నె ♦ కెక్కినదయి
ఘనుల కెందఱకో జన్మ ♦ కారణమయి
సన్నుతులు గన్నద్రావిడ ♦ శాఖయందుఁ
బుట్టినాఁడవె సాధులఁ ♦ దిట్టిపొంతె. 207

క. లేనిది నీ వొక్కఁడు మా
పైనాడిన నీకుఁ గలవి ♦ పది మే మాడం
బూనఁగలము మానము నభి
మానము లేదుగద నీకు ♦ మఱి యే మన్నన్. 208

గీ. కాళ్లు పైకెత్తి మీఁద నా ♦ కసము విఱిగి
పడిన నాఁపుదు ననుకొందు ♦ వెడఁద నీవు
ఆకసం బేడ? నీ వేడ? ♦ నాఁపు టేడ?
మిట్టిపడకుము తీతువు ♦ పిట్టకాన! 209

గీ. నాదుకూఁతలు దుర్నకు ♦ నమ్మ లగుటఁ
దలఁతురుదురు నాకు జను లంచుఁ ♦ దలఁపఁబోకు

వారితిట్టులచే నోరు ♦ వడదె నీకు
మిట్టిపడకుము తీతువు ♦ పిట్టకాన. 210

గీ. కనుల కింపైనయాకార ♦ గరిమ గల్గి
చెవుల కింపైనగానంబు ♦ చవులు నేర్చి
వెలయుఖగములలోఁ బేరు ♦ గలదె నీకు
మిట్టిపడకుము తీతువు ♦ పిట్టకాన! 211

గీ. శుకపికమ్ములకైవడి ♦ శ్రుతిసుఖముగఁ
బాడనేర్తువా పచ్చిక ♦ బయళులందు
నాడనేర్తువా యేటి కీ ♦ యార్భటంబు
మిట్టిపడకుము తీతువు ♦ పిట్టకాన! 212

గీ. నియతముగ నీకు విధిచేత ♦ నిహితము లగు
తిప్పలంబడి యెట్టులో ♦ దేహయాత్ర
నలుపుకొను మంతియే కాని ♦ తెలివిమాలి
మిట్టిపడకుము తీతువు ♦ పిట్టకాన. 213

గీ. అంజ కిట్టులు మున్ను నీ ♦ వింజరమున
నున్నయప్పుడు నీనోరఁ ♦ దిన్నఁబఱుప
మిట్టిపడకుము తీతువు ♦ పిట్ట యనెడు
మకుటమున నిన్నుఁ దిట్టఁడే ♦ మహితుఁ డొకఁడు. 214

గీ. మూల్య మీకుండఁ బుస్తక ♦ ములను బడయ
వారు వీరును బొగడుచు ♦ వ్రాసినట్టి
బద్దులకు నేమి? యందఱు ♦ యొద్దనుండు
వానిఁ బ్రకటించుటను గౌర ♦ వంబు గలదె? 215

గీ. తాతపూడి భానప్ప బం ♦ దరుకు వచ్చి
తద్దినముఁ బెట్ట భోక్తగాఁ ♦ దానె కుదిరి

పాలుగొని యిచ్చి నీవు ద ♦ బ్బరలు వ్రాయఁ
బూనుకొనలేదె పాపాల ♦ భైరవుండ! 216

క. మఱియు నిటు లెవ్వరినో క
క్కుఱతికి లోఁబడినవారిఁ ♦ గోరి యనృతముల్
బఱటించుకొంటి వంతనె
నెఱవాదివి గావు; బుధులు ♦ నిన్నెఱుఁగ రొకో? 217

క. మాభారతనామమ్మును
"హాభారత" మనుచు విఱిచి ♦ తౌరా! యెదియో
నీభావ మెఱుఁగ మాంధ్రమ
హాభారత మల్లె విఱువ ♦ నగుర హతాశా! 218

క. శ్రీభవ్య! రామకృష్ణమ!
హా! భారతముఁ రచించి ♦ యస్మద్దుర్గీః
ప్రాభవ మడఁగింతువె? యను
నీభావము దెలియవచ్చె ♦ నింద్యారంభా. 219

క. మాపేరులఁ గూఱిచి యెదొ
వాపోతివి దానినిచటఁ ♦ బలుకఁగ నేలా
మీపేరుతిన్నదన మది
యేపాటిదొ చూచుకొనుమ ♦ హీనచరిత్రా! 220

చ. తిరుపతికంటె వృద్ధునని ♦ తెల్పెద వీవు వయఃక్రమంబునం;
దిరుపతిపేరు ముందునకుఁ ♦ దెచ్చితి వెట్టులు? దీన నీదు పె
ద్దఱికమ దేడఁ బోయెఁ గ్రిమ ♦ త న్విడి వెన్కది ముందుకీడ్చితో
వెఱ్ఱి! యటు గాక నీమదికి ♦ "వేంకటతిర్పతు" లంటఁ బోలదో?

గీ. మొదటినుండియు నీయాసు ♦ మొలకఁ బెంచి
కలహమున కంతకును మూల ♦ కారకు లయి

నెలసినమహాత్ము లెందఱో ♦ గలరు వారు
చెప్పరానట్టివా రౌటఁ ♦ జెప్ప మిందు. 222

చ. కలిగినవారిఁ గన్గొనినఁ ♦ గన్నులనీరులు కాల్వఁ గట్టఁగా
వలవలపోయుచుండెడుస్వ ♦ భావము గల్గినయట్టివారలం
దలఁచినఁ బాతకం బగుఁ గ ♦ దాయని యెంచి త్యజించినారమీ
కలహపరాయణుల్ దిరము ♦ గానిలువం బనియేమి యీకృతిన్ ?

గీ. కలఁడు రామాయణమునందుఁ ♦ గాలనేమి
భారతమున శిఖండి చె ♦ ప్పంగఁబడియె
రుక్మి భాగవతమ్మున ♦ రూఢి కెక్కెఁ
దావులే దిం దజాగళ ♦ స్తనగుణులకు. 224

క. కలకాలము ప్లీహపయిని
నెలుకను నెలుకపయిఁ బిల్లి ♦ నెక్కించుచుఁ ద
త్కలహమ్ములఁ గనుఁగొని యీ
కలియుగనారదులు కౌతు ♦ కమ్ము భుజింతుర్. 225

గీ. కొంచెపుఁబ్రయోజనమునఁ గ ♦ క్కుఱితిఁ జెంది
మావిపక్షులతోఁ గూడి ♦ మాడి వీండ్రు
పాపకృత్యము లొనరింతు ♦ రైసిమాలి
కూలికి విషమ్ముఁ ద్రావెడు ♦ కుమతు లట్లు. 226

క. కొలిచినయందుల కించుక
ఫలమైనను దమకు లభ్య ♦ పడకున్నను ద
త్ఫలమే యాకాంక్షింతురు
గలివోసిన నుట్టివంకఁ ♦ గనుఁగొనెడుక్రియన్. 227

మధురాక్కర.

ఎంతసర జనకుండు నన్న ప్ర ♦ దాతయును భయత్రాత

యనఘ! యుపనేత మఱియు ని ♦ రంతరాధ్యాపకుండు
నన( గ( బురుషున కిద్యోవు ♦ రనయంబు గురువులై రి"
యనుచుఁ బల్కెడుభారతా ♦ ఖ్యానంబు వినఁగ లేదె! 228

క. *ఒకరునకుఁ సకృదధ్యా
పకుఁడవు నీ విద్యారికి ను♦పాధ్యాయతఁ జె
ప్పకొనెద వటులైన నుపే
క్షకుఁ దగియెద వుత్పథప్ర ♦ సక్తుఁడ వగుటన్. 229

సీ. గ్రీపగతుండి దైన నొప్పఁ జె ♦ ప్పఁ వలయును
గురునిదైనను దప్పు వా ♦ కొనఁగవలయు
గురుఁడ నని యూరకే యను ♦ కొనుచు నింద
లాడువాని నినుం గొని ♦ యాడ నేల? 230

ఉ. పాడిఁ దొరంగి నోటి కెటు ♦ వచ్చిన నట్టులె పిచ్చిపాటలం
బాడుచు నీవు నిరతముఁ ♦ బల్కితిఁ జాలఁగ నంచుఁ గుల్కుచు
న్నాఁడవు వేంకటాచలమ! ♦ నా కదిచూచిన నవ్వ వచ్చెడున్
గాడిదపాలసామెతప్ర ♦ కారము నీవు వినంగ లేదొకో. 231

ఉ. తిట్టుము నీకుఁ దోఁచినగ ♦ తిం గసిదీఱఁగ నింక నే మ ది
ట్టట్టనఁబోము నీ వనిన ♦ వన్నియు నీకె ఘటించుఁ గాని మా
కెట్టియగౌరవమ్ము రచి ♦ యింపఁగఁ జాలవు మేము తాళముం
బట్టితి మాకసంబునకుఁ ♦ బృథ్వికిఁ; బొమ్మిఁక వేంకటాచలా!

క. పాపం బనక యసత్యా
లాపము లాడంగ నేమి ♦ లాభము గలుగున్

---

*శ్లో. గురోరప్యవలిప్తస్య । కార్యాకార్యమజానతః
ఉత్పథంప్రతిపన్నస్య । పరిత్యాగోవిధీయతే
శ్లో. శత్రోరపి గుణావాచ్యా । దోషావాచ్యా గురోరపి,

గోపమునఁ జేసి దోషా
రోపణ మొనరింపకువె ప ♦ రుల్ దెగడంగన్. 233

ఉ. పాడిఁ దొఱంగి పట్టినదె ♦ పట్టుగ నిట్టు లహర్నిశంబుఁ ది
ట్లాడుచునున్న విన్నబుధు ♦ లందఱు నవ్వరె యెవ్వరేని యీ
పోఁడిమి మెత్తురే వెడఁగు ♦ పోఁకలఁ బోవఁగ నేల? ధర్మమున్
వీడఁగ నేల? దుర్యశము ♦ వెంపఁగ నేల యనక్షరంబుగన్. 234

క. పరులను దూఱుటె కానీ
పరికింపఁగఁ బోరు తమదు ♦ బ్రిదు కెట్టిదియో
గురివెందగింజ తననలు
పెఱుఁగదనుచుఁ జెప్పుమాట ♦ యీనాఁటిదియే? 235

చ. నిరుపమశేముషీవిభవ ♦ నిర్జితనిర్జరదేశికుల్ కవీ
శ్వరు లిపు డెందఱో వెలసి ♦ సర్వవిధమ్ముల నిన్ను భూపురం
దరబహుమాన్యఁ జేసిరి గ ♦ దా యికఁ నీవు దరిద్రితాపరం
పర దిగఁద్రావి యొల్లవిభ ♦ వమ్ముల వర్ధిలుమమ్మ భారతీ! 236

## ఈశ్వరారాధనపర్వము. 12

సీ. ఎవ్వఁ డీలోకమ్ము ♦ నెల్ల నిచ్ఛామాత్రఁ
జేసి చిత్రముగ సృ ♦ జించుచుండు
నెన్న శక్యముగాని ♦ యీప్రాణికోటులఁ
గరుణతో నెవ్వాఁడు ♦ కాచుచుండు
దోషు లౌభక్తుల ♦ దురితముల్ దొలఁగించి
చిత్తశుద్ధి నెవండు ♦ సేయుచుండు
తన్ను నమ్మినవారి ♦ కెన్నండు గోరిక
లెవ్వాఁడు వేడ్కతో ♦ నిచ్చుచుండు

గీ. సతఁడె వాఙ్మనసాప్రమే • యపరిభావుఁ
డాతఁడే యవ్యయుఁడు పర • మాత్ముఁడతఁడె
రక్షకుఁ డతండె సర్వేశ • రణ్యుఁ డతఁడె
యుర్వి నతఁ డొక్కఁడే యుపా • స్యుండు మనకు. 237

క. మనమందఱ మాపరమే
శు నుపాసించుటకు నతని • సుగుణమ్ములనె
ల్లను గానము నొనరించుట
కును నేఁ డీజగతియందుఁ • గూడితిమి గదా. 238

గీ. ఆతఁ డిప్పుడు మనహృద • యములయందుఁ
బావనం బగు శ్రద్ధయుఁ • బ్రచురమైన
భక్తియును గూర్చి మన సేయు • ప్రార్థనములు
వేడ్కతో సఫలములుగా • వించుఁ గాత! 239

సీ. సత్యరూపుండ వై • సర్వకారణమ వై
నిత్యుండ వై మహా • నీయుఁడ వయి
యఖిలాత్మలకు నీవ • యాత్మ వై యానంద
మయుఁడ వై యత్యంత • మహితుఁడ వయి
యాద్యంతరహితుండ • వై యనామయుఁడ వై
యప్రమేయుండ వై • యనఘుఁడ వయి
శాంతుండ వై సర్వ • శక్తి వై కళ్యాణ
కరుఁడ వై నిర్మలా • కారుఁడ వయి

గీ. యణువుకంటెను మిక్కిలి • యణువ వగుచు
గురువుకంటెను మిక్కిలి • గురుఁడ వగుచు
నిఖిలభూతమ్ములందును • నిండియుండు
నీశ్వరా! మ్రొక్కుచున్నార • మిదిగో! నీకు. 240

గీ. నీవు రక్షింపకుండఁగ ♦ నిమిసమైన
నిలిచియుండుట కేరు ను ♦ న్నీశులు? చెప్పను
కాన నశరణ్యులను మమ్ముఁ ♦ గావఁగదవె
దీనలోకశరణ్యా! మా ♦ దిక్కు నీవె. 241

గీ. ఆదిమధ్యాంతరహిత! మ ♦ హానుభావ!
నిత్య! నిర్మల! భక్తసం ♦ స్తుత్యచరిత!
కరుణతో నీవు మా నమ ♦ స్కారములను
గైకొని యనుగ్రహింపవే ♦ లోకనాథ! 212

ఉ. ఈసకలప్రపంచమును ♦ నెప్పుడు నీమహిమంబె చాటు; నీ
వీసకలప్రపంచమున ♦ నెక్కుడఁ గాంచినఁ గానవత్తు; వా
హా! సకలంబు నీవశమ ♦ మై తనరారుచునుండె దేవదే
వా! సకలేశ! నీమహిమ ♦ వర్ణనసేయఁగ నేము నేర్తుమే? 243

ఉ. ఏరికి నీదుశక్తి వచి ♦ యింపఁగ శక్యము? నీవు సృష్టికా
ధారుఁడ వప్రమేయుఁడవు ♦ త్రాతవు నేతవు భక్తలోకమం
దార! యుదార! మేము భవ ♦ తంత్రవిధేయుల మీవు మా నమ
స్కారము లాదరమ్మమెయిఁ ♦ గైకొని మమ్ము ననుగ్రహింపవే.

ఆ. గీ. దాత వీవె మాకు ♦ ధరణీశుఁడవు నీవె
తండ్రి వీవె మాకుఁ ♦ దల్లి వీవె
బంధు వీవె మాకుఁ ♦ బరమమిత్రుఁడ వీవె
శరణ మీవె మాకు ♦ సకల మీవె. 245

మ. కరుణాసాగర! భక్తవత్సల! మముం ♦ గాపాడుమా యెప్పుడున్
దురితమ్ముల్ మముఁ జెందనీయకుమె యా ♦ ఘుల్ వ్యాధులుం బాపి ని
ర్భరసమ్మోదము మాకుఁ గూర్పుము నినుం ♦ బ్రార్థింతు మెల్లప్పుడున్సా
దరభావమ్మున మమ్ము నేలుకొను మో ♦ తండ్రీ! జగత్కారణా!

## మంగళమహాశ్రీవృత్తము.

శ్రీరుచిర! లోకము ల♦శేషమును నీయెఱుక♦చే జరుగు; నీవిఁక ను
మాయా
వేరముగతిం దెలియ♦వే! యిటను దుండగము♦వేరిది? కృపాజలధి
యస్మ
ద్వైరు లపరాధమున♦వారయిన వారికి న♦వారిగళమంబిడుము
మాదే
సేర మనుచిత్త మగు♦నేని కరుణింపుము వి♦నీతిఘనమంగళ
మహాశ్రీ.



గీ. వసుధ సర్వజ్ఞుఁడనఁదగువాఁడుగలఁడె ?
యెవనికి రమేశ్వరుండెంతయిచ్చెనంత
గల్గుగద తెల్వి? యంతనే గర్వమూనఁ
బోఁడు సజ్జనుఁడగు మానవుండు మదిని.

గీ. పాండితీశక్తి కవితాప్రభావ మాత్మ
గౌరవంబునుగలవారు గౌరవంబుఁ
గాంచఁ; గాంచెద రవిబోయిగచ్చులాడు
వారు పూర్వసువాసినీ గౌరవంబు.

ఉ. కాలులఁబట్టి కల్లలటుక న్వడి నాడుచుఁగొంకులేక ని
ష్కారణ వైరమూని విను సజ్జనులెల్లెడ బ్రిప్పఁదిట్ట వా
క్కౄరతఁజూపిగీరతమొ గోరతమో మదిఁదారతమ్యముల్
మీఱిరచించు మార్గములు మేలగునే పరికింపుఁడాత్మలన్.

సీ. పట్టఁగాలేక నాచుట్టుబలాదూర
టంచుఁబల్కాడు సామ్యంబురీతి
నాశుకవిత్వమా యదిపొట్టకూటికిఁ
గానిశాస్త్రీయంబుగాదటంచు
రజ్జులుగొట్టిపరశ్రేయమొక్కింత
గనలేకవాదంపుఁగలనశేగి
చతురత చూపుచుఁజంకునుగొంకును
లేకనోరికివచ్చులీలఁబలుక

గీ. మీకపోజెల్లెఁగో మీయమేయపాండి
తీమహత్వంబుజనులకుఁదేటబడియె
---

నెల్లచోటులనింక మీ కేమిలోటు
అకటతిరుపతి వేంకటేశాఖ్యులార!

సీ. ఆశుధారాకవిత్వాడంబరంబన్న
నల్లేరిపై బండినడక మాక
టంచదిఘనముగా నెంచి భూపాలకా
స్థానంబులందు పెద్దలమటంచు
నావులెక్కడలేనియట్టియూరను గేదె
శ్రేకామధేనువై మెసఁగురీతి
నాశుకవిత్వంబునం దుదిట్టలు లేని
యట్టిరోజులదానిసభిమతించి.

గీ. యిపుడుతలఁదన్నువారలు హెచ్చిరాఁగ
నాశుకవనంబశాస్త్రీయమంచుఁ బలుకఁ
దగునె? బుద్ధిముదిమి మదిదప్పినపుడు
వెనుకఁ బల్కిన నుడులున్నె మనములందు.

సీ. కృతినెట్లొ వ్రాసి "వ్రాసితి" నంచు కేల్గొట్టఁ
బిప్పిగంతులు వైచు పిల్లవాండ్రు
"ఆరాజుజూచినప్డాదరింపమిదిట్టి
తిరిగి" మనసంతోషించు దీర్ఘగుణులు
"పాండ్రు బల్కకల్కిని బ్బరపుఁజన్నుంగవ
మీకేత" యన మేనుమరచు రసికు
"లెట్లైన నితరులనెక్కిరాసీఁగూడ"
దను వెజ్జులనుజూచి యలరుసఖులు

గీ. సభ్యులేనీకు వేంకటేశకవివర్య
మాన్యులందఱునీకొఱమాలుపల్కు

లాదరింపకపోయిరే! యక్కటకట!
యయ్యయో! యెంతసంతాపమవతరించె. 6

గీ. విద్యలందున నుత్తమవిద్యయనుచు
నుతులొనర్చుచుఁ బూర్వ భూపతులు కవులు
పండితాఖండలులుగొల్వ వన్నెఁగన్న
కవిత ! కష్టసుఖాలు లెక్కయఁటె ? నీకు. 7

సీ. అఱకాలనొక్కటి కఱకుముల్ గాడిన
నదియొక పద్యమౌనట్టు లల్లి
నిదురింపఁగానల్లి బెదరి లేవఁగఁగుట్ట
నదియొక పద్యమౌనట్టు లల్లి
యూర దాసిదిమెచ్చి చేరికౌఁగిఁటఁజేర్ప
నదియొక పద్యమౌనట్టు లల్లి
నశ్యంపుఘాటుచే నాల్గుతుమ్ములు దుమ్మ
నదియొక పద్యమౌనట్టు లల్లి.

గీ. భారతాదికదివ్య ప్రబంధములకు
మాఱుగ వికారపుంబెళ్ళమర్చి తిట్టు
కబ్బములుగూర్చు కాకవుల్ గలరటంచు
వంతగనకమ్మ సత్కవివరులుఁ గలరు. 8

ఉ. కల్ల నిజంబుగా నిజముఁగల్లగఁజేయుచుఁ బక్షపాతులై
యల్లరి సల్పుచున్ దమకునంటనిదే పయిపైచుక్కొంచునే
చల్లని నీయశంబుఁ దిగజార్పఁగఁ బిచ్చికవుల్ మెలంగిరం
చుల్లమునందు నుమ్మలిక నొందకుమో! కవితాలతాంగి! మా
తల్లి! భవత్ప్రియాత్మజు లుదగ్రమనీషులు నిన్నుఁబెంచి తా
రుల్లసితాచ్ఛకీర్తిఁగొని యోగ్యతనిల్పఁగలారుగావునన్. 9

గీ. అందరానట్టి ద్రాక్షకై యఱ్ఱుసాచి
దానిదూఱెడు జంబుకోత్తముని కరణి
వశముగానట్టి నీమహత్త్వంబుఁ దెగడు
మందులక్షమించి నామ్రొక్కు లందుకొనుమి. 10

సీ. తిరుపతికవులపై తీపెంత నెలకొన్న
నన్యకవీంద్రుల నరయవలదె
యరసివారలకైతయలరించునో లేదొ
యంచితాత్మలవిచారించవలదె
వలసిన పెద్దపిన్నలఁగూర్చియుభయుల
శక్తిసామర్థ్యముల్ చాటవలదె
చాటలేకున్న నిచ్చకమాడుమూర్ఖుల
నెంచకుండుటకుఁబ్రార్థించవలదె.

గీ. ఏదియును లేకతనకైన దేయనిమిష
కాంతయనిగుద్దులాటకైగడఁగుచుంట
సత్పథంబనిమీ మనస్సాక్షియనునె
కృతకవిశ్వేశ్వరా! నమస్కృతులునీకు. 11

శా. రంగోత్కుండనిసాటి రాఁదలఁచి గర్వస్ఫూర్తిమైఁబోలకే
రంగత్తుంగతరంగసంఘములతో రాజిల్లువారాశిమీఁ
దంగంపిలపకనూరుయోజనములుద్యల్లీలఁబోనేర్తువే
కొంగా! హంసనెదిర్చిభంగపడకేకోల్పోకె నీమానమున్. 12

శా. అగంబెంతయుఁగ్రొవ్వబాలకులహేయంబైనయుచ్ఛిష్టముం
బొంగారందినికోకిలాఢ్యములతోఁ బోరంగనుంకించిమున్
భంగంబందెనుగాకి;నీకునిపుడప్పాటేలభించుంజుమీ
కొంగా! హంసనెదిర్చిభంగపడకేకోల్పోకెనీమానముల్. 13

శా. సింగంబుంగనివృద్ధజంబుకమునింజేయంబ్రయత్నించునో
జంగాండంగనిడీకొనంజనుపొటేల్ చందంబునందార్ఢ్యతో
డంగయ్యంబున కేగుకుండలిగతిన్ డంబంబులంజూపి యో
కొంగా! హంసనెదిర్చిభంగపడకే కోల్పోకె నీమానముల్. 14

శా. సంగీతంబునుసాహితీపటిమయుంజారుస్తనద్వంద మే
శృంగారంబుఘటింపఁగానలరురాజీవాక్షియవ్వాణిపేరి
మంగన్గాం చనిశంబుమన్నట నసామాన్యంబునీవైరియో
కొంగా! హంసనెదిర్చిభంగపడకే కోల్పోకె నీమానముల్. 15

శా. అంగీకారముతోఁగవిప్రకరమత్యానందముంజెందిమె
చ్చంగానిర్మలమానసస్ఫురితమైసద్వృత్తవిస్ఫారమై
నింగిన్నెజయశంబునించియలరున్నీశత్రువల్లాటనో
కొంగా! హంసనెదిర్చిభంగపడకే కోల్పోకె నీమానముల్. 16

సీ. అనవరతాన్న విద్యాదానతృప్తవి
ద్యార్థివిరాజద్గృహాంగణుండు
వ్యాకృతితర్కవేదాంత మీమాంసాది
రమణీయశాస్త్ర పారంగతుండు
సకల విద్వజ్జనస్తవనీయవిషయ వి
భాసితా ప్రతిమానభాష్యకర్త
సరససంస్కృత కావ్యచంపూముఖశతాధి
కగ్రంథనిర్మాణ కలితయశుఁడు.

గీ. హరిబెల్లముకొండ వంశాబ్ధివిధుఁడు
రామరాయకవీంద్రుండు ధీమహితుఁడు
చెన్నమీఱంగఁ దాఁగూరుచున్నచోట
నిలచుటకునైన నర్హతగలదె మీకు. 17

సీ. అవధానసమయమ్మునందు సంస్కృతసమ
స్యను మీకొసంగిన యతఁడొకండు
పూరింపలేక తప్పనమస్యఁగలదంచు
వడిఁ బలాయితులైనవారుమీరు
తప్పెట్లులని వెంటఁ దవిలిన ఘనుఁడు ప్రా
కటభవదీయశాఖాభవుండు
మీ తెల్వితేటలీకితిఁ బత్రికలయం
దెటిఁగ వ్రాసినవార లితరజనులు.
గీ. రామరాయని జోక్యంబిందేమిగలదు
మీయశక్తికి నెవరేమిచేయఁగలరు
కారణమెదియులేకయు వారినిట్లు
దూఱదొరకొంటిరే నీతిదూరులగుచు. 18
సీ. అగ్రహారత్రితయాధిపుండతఁడు వా
రక దేవిరించు యాచకులుమీరు
వరకవి పండితాదరణశీలుఁడతండు
పండితదూషణపరులు మీరు
భాష్యనిర్మాణ దీవ్యద్ధీయుతుఁడతండు
గీరతమ్మును గీయువారుమీరు
సలలితశాంతాద్యఖిల గుణాఢ్యుఁడతండు
వితతమాత్సర్య సంయుతులుమీరు.
గీ. మానితసమస్తశాస్త్రప్రవీణుఁడాతఁ
డొక్కశాస్త్రమ్మునేనియు నుచితలీలఁ
బారమొందంగఁ జదువనివారుమీరు
కాన నాఘనునకు మీకుఁగలపొమెట్లు
పొసఁగనేర్చును? సములైనఁబొసఁగుఁగాక. 19

ఉ. చూచితిమయ్య మీమదిని జొచ్చినయీర్ష్య జగంబెఱుంగఁగా
గీఁచినపద్దియంబులను గీరతకావ్యకవీశులార! మీ
తోఁచిన యుక్తికల్పనలు తోషము గూర్చఁగహింపుఁడిద్దివే
యీచదువెల్లఁగట్టి, కలహింపక తిర్పతివేంకటేశ్వరుల్. 20

ఉ. ఇంగితమున్నయట్లు హితమీరొడఁ దెల్పఁగనింతకాలమే
నింగికిఁబ్రాఁకనేగితిరొ, నీరధిదూరితిరో నరేశ్వరుల్
బొంగుబుజానవైచుకొని పోయెదమెక్కడికైన ముష్టిచెం
బుం గొనిపెట్టుమంచడుగఁబోతిరొ? తిర్పతివేంకటేశ్వరుల్. 21

ఉ. ఆఱనివేడ్కఁ బాలుపెరుఁగాజ్యము వేగఁ బళించుచుండి త
న్నేరునెఱుంగకుండుటకు నీక్షణముల్ వెసమూయునట్టి మా
ర్జారములట్టులన్ నిరపరాధులమంచు నెఱుంగఁజేయుమీ
తీరెఱుగంగలేరొకో సుధీరులు తిర్పతివేంకటేశ్వరుల్. 22

చ. ఉఱుకుఁడంచుఁబొంగుచు నుపాయనుతోలుదురింతెగాక తో
డుతికేఁడువారలుండరని యోచనసేయక నేఁడువోలెలో
గరువముబూని దూఁకుటనుగాక రపత్తిని శృంగభంగమై
పసువునుమాపదో నిజముఁబల్కుఁడు తిర్పతివేంకటేశ్వరుల్. 23

చ. కనుఁగొనినాము రాట్సభలఁ గైకొనినారము మెప్పులంచు సి
గ్గునుఁగన కేలడంబములు గొట్టెద రాన్నృపులద్ధివంచనం
బొనరుపరాదటంచు నెటులో యొనరించిరి కాక మీనుశ
క్తినిఁగని మెచ్చిరా నిజము దెల్పుఁడు, తిర్పతివేంకటేశ్వరుల్. 24

చ. ఎఱుఁగక తప్పొనర్చి యిదమిద్ధమటంచును గుద్దులాడియుం
దఱుఁదెగనాడ సిగ్గిలక దంభముఁజూపుచు నేఁటికేట్టులో
మొఱఁగి స్వశక్తిఁ దద్గతికి నెంతయుఁ జింతవహించి మెల్లనన్
శరణముఁదెల్పఁజూచు మిముస్వాంతము మెచ్చె భయంబుదక్కఁడీ.

చ. ఇదియవధానమంచనకుఁడీ మముమున్నటిపేరుచేత నే
యెదురక గౌరవింపుఁడిఁక నిండ్లకుఁ బంపుఁడి ప్రోవుడంచులో
నదరుచు గర్భిణీసతులమంచలగత్రపురీసభాస్థలిన్
బెదరుచు వేడి; నేఁడిటులఁ బ్రేలఁగ నెవ్వరియూత తెల్పుఁడీ. 26

ఉ. ప్రాసములున్ విరామములు పాడొనరించుచుఁ బూతుపద్యముల్
వ్రాసిరి నాటకంబులుఁ బ్రబంధములంచని పేరుబెట్టియు
ద్వాసనమాచరించిరల ప్రాక్కవిమార్గములట్టి వీరికి
రోసములాయటంచు మిమురోయతె సత్కవిరాజహంసముల్. 27

ఉ. కాకరపర్త్రి యేసలిపె గర్వముమానిపి శృంగభంగమున్
గాకులయట్లుబాఱఁగఁ జికాకొనరించెను పైడిపాడుపై
యాకులపాటుఁ దెచ్చి బలమంతయుఁ బాపెను గొప్పరంబిఁకన్.
గూకలుమాని యొందొ తలఁగుక్కుఁడు తిర్పతివేంకటేశ్వరుల్. 23

మ. ఒకటన్ శిష్యుఁడుమిమ్ముమీరుమఱి శిష్యున్ మెచ్చుటన్ జూచియో
ల్లక ప్రాజ్ఞుల్ నిరసించుచుండిరిదియేలా? కాకిదాపిల్లకా
కికి ముద్దంచని మేము తెల్పినమిమున్ గేల్కొట్టుటల్ మానరో
యకలంకాత్ములనెందుగండికవులారా భక్తిఁ బ్రార్థింపుఁడీ. 29

మ. కవితాపత్త్రికవారు సాయపడుపోకల్ దోఁచెనే మాకింకన్
గవితాపత్త్రికవారేకాక కవితాకంజాక్షియున్ దోడగున్
గవితన్ గాంచినవారు సత్కవులకున్ గారేహితుల్ వేక్రమం
బువిశేషంబెఱిగింపఁ దిట్టిరని వాపోవంగలాభంబొకో. 30

ఉ. ఎచ్చటిభంగపాటచటనే యెఱుఁగంబడుఁ బుస్తకంబునం
దచ్చగునేని తక్కుజనులందఱు మెచ్చెదరంచు బద్ధపున్
మచ్చుపొడిన్ జగంబుపై మాటికిఁ జల్లుచు నుంటిరే యిసీ
గచ్చులు వ్రాసి వీఁచెడినకల్లవధానపు లక్కబొమ్మలన్. 31

క. ధారణయుడఁగఁ గవితా
ధారయును జెడంగ మిగులఁ దల్లడపడి గుం
టూరున మీర్పడుపాటు లిఁ
కేరికి వలదంచు సభ్యు లెంచఁగ లేదే. 32

ఉ. గర్తపురావధానమునఁ గాశి కులీనుఁడొకండె కాక మీ
యార్తియడంగ నెందఱు సహాయమొనర్చిరొ వారినందఱన్
గుర్తుగ నెంచుఁ దక్షులకున్ దమసంగతి యెట్లుతోఁచెనో
పూర్తిగఁ జెప్పుడింక వగఁబొందక; తిర్పతివేంకటేశ్వరుల్. 33

శా. వారున్ మీ రుసిగొల్పినంతటనె ద్రవ్యప్రీతిచే నేల యా
యూరున్ జేరితి ముందరాని యవధానోద్యోగముం బూని యే
లా రట్టొందితి మున్న పేరు చెడె నేలా యంచుఁ జింతించుచు
న్నారంచున్ మిము మీహితుల్ తెలుపుచున్నారే లయీ వార్తలున్

శా. తప్పంబల్కితివంచు, రేపితివి గాఢాయంచు, దుర్వారమౌ
ముప్పుం దెచ్చితివంచు, వేమరలుపన్ బుత్తెంతురేయంచు మా
యొప్పున్ న్నిమ్మదినెంచి యొండొకరు లోహో గ్రుద్దుకోఁబోరె శా
జెప్పండే భవదీయజీవసముఁడౌ శిష్యుండు మీచందమున్. 35

సీ. ఘనులు మాకంటెలోకమున లేరని లేత
సొరకాయ లూరక పరుకువారు
పండితుల్ వాదింప, రండనబీరముత్రొ
దక్కి మూలలయందు నక్కువారు
తప్పులకుప్పలై యొప్పంగఁ జలువిశా
రపుఁ బెల్ల గ్రంథముల్ వ్రాయువారు
పరుల దూషించుటే ప్రాధాన్యవృత్తిగా
గొని మహాయశమందఁ గోరువారు

తే. గీ. మేటికవులని తోఁచిన మీరె వారి
చరణములధూళి శిరముపై జల్లికొనఁడు
ఇంక నేమని యొసరింపు డింతెకాని
కలుపకుఁడు మమ్ము మాత్రి మికార్యమందు. 36

ఉ. యాచకులన్న మాత్రమున నాగ్రహ మింత వహింపనేల స
ద్యాచతురాత్మ వారి వసుధాధిపదర్శన మెన్నఁ డేనియుం
జూచితిరో కొ లేదొ మును జూడకయుండిన నిప్పుడేనియుం
జూచి యథార్థముంగనుఁడ దనూయను వీడుఁడి శాంతిజెందుఁడీ. 37

శా. ఎట్టో విద్యలనభ్యసించికొని యాయీ దూరదేశంబులం
బట్టం బంచును బల్లెయంచనక విద్వద్వేషముంబూని బల్
తిట్టుల్ దిట్టుచు దిట్టులంబడుచు నిర్దిష్టఫలం బేమియో
పొట్టా నీదురదృష్ట మిట్లయినచో... (నానారాజసందర్శనము. 38

తే. గీ. ఇంతఁగల భావముంగని యెవ్వరేని
యాచ్న గాదిది సర్వరాజ్యాధిపత్య
మనివచింపంగ నేర్తురే యతయుమయ్య
సమధికకార్యచర్యయో శాస్త్రివర్య. 39

సీ. పసుగురికుపయోగ పడెడు వెన్నెలగుడ్డి
వానికి నది కొఱగానియట్లు
పదుగురికిని మంచి పరిమళంబొసఁగెడు
సంపంగి యళికి నచ్చనివిధమున
పదుగురి కానంద మొదవించు గానమ్ము
కడుఁ జెవిటికి నింపుగానికరణి
పదుగురికిష్టమై పరగెడు శర్కర
కలితరోగికిఁ జవిగానిపగిది

తే. గీ. సకలదేశాదృతంబై ప్రశస్తమగుచు
వెలయు కౌముదిపాండిత్య బలములేని
కాకవికి వెగటైననౌఁగాక దాని
నొప్పమను ప్రాజ్ఞులుందురే యుర్వియందు. 40

ఉ. శక్తికిమీఱి నట్టిపని సల్పెద మంచ సరేని దుర్మనో
రక్తులుగాంచ యేని కవిరాజులఁ దిట్టుట మానిరేని సం
సక్త శమాదిసద్గుణవిశారదులేని గణించిచూడ ని
ర్ముక్తరుపాత్ములేని భువిఁ బూజ్యులె తిర్పతివేంకటేశ్వరుల్. 41

గీ. మీకవికిఁ బట్టుకొమ్మయా కాకినాడ
యందు సోదరకవులు జయధ్వజంబు
నిలిపిరాకొక్కొ మరియెట్లు గెలువవలెనొ
శక్తికలదేని యవ్వారు సభకురారె. 42

గీ. సభను దిరుపతివేంకటేశ్వరుల శక్తిఁ
జూడకున్నప్పు డెందఱు ప్రౌడలనియె
తలఁచినారలు సభ వారి తెలివియెల్ల
తేటపాటనె యీలాటి చేటులోదవె. 43

క. ఏయూరిసింగ మిదియని
ప్రాయరె మును రామకృష్ణవరకవు లదియే
నీయెడ దృష్టికిరాదె యి
నీ యేమనిపలుకువారు సింగములనుచున్. 44

శా. ఔరా సామజకుంభనిర్దళన ధైర్యాంచన్మృగేంద్రంబులై
నారా నేటికి పారుబోతులటులైనందప్పు నేమిప్పు దు
ర్వారంబై యల రామరాయకవి శౌర్యస్థైర్య గాంభీర్యరే
ఖారాజచ్ఛరభాకృతింగవిసి బింకమ్మెల్ల వారింపఁడే. 45

సీ. పేచీలు బెట్టి తప్పించుకొందురుగాని
సభయన్న వీరు రాజాలరనిరొ
ప్రాజ్ఞులుగానివారలతోడ మనకన
వసరమ్ముగా నేల వాదమనిరొ
దేశమెల్లెడ వీరి తిట్టుపద్యములువ్యా
పించి నైజయశమ్ము డంచుననిరొ
ఒకశాస్త్రమందేని ప్రకటపాండితిలేని
ఘనులతో నేటికి కలహమనిరొ
తే. గీ. తలఁచి గతకాలమునఁ బండితులు తదీయ
గర్వమడఁపక విడిచిన కారణమున
సాగె నీయాటలాడిన సాగవింకఁ
గుట్టుబయలయ్యె వెనుకటి బెట్టుచెడిరొ. 46

సీ. గీరతమ్ము బఠింపఁగోరి మిమ్ముగ్రాస
నమునందు నిల్పియున్నారటంచు
పరనిందలెల్ల మీపత్రికకే పలు
మారు బంపించుచున్నారటంచు
నెలకొని మీవిరోధులమీఁది వ్యాజ్యెమ్ము
నను సాక్ష్యము నొసంగినారటంచు
ప్రాణమిత్రులరని పాటించి సముచిత
గౌరవం బొసఁగుచున్నారటంచు
తే. గీ. తారుమారైనవారి గుంటూరిశతవ
ధానమును మీరు పక్షపాతమ్ముచేత
నెంత నుతియించినను నుతియింపవచ్చుఁ
గాని నమ్మెడువారు లోకమున లేరు. 47

# ప్రక్షిప్తపర్వము.

ఇట్టి ప్రక్షిప్త పద్యము లెన్నియేని
గలవు వానిని బ్రకటింప వలనుగాక
విడిచినారము తిరుపతివేంకటేశ్వ
ర కవివృషభుల కిఁక సంబరంబు గాత.



# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. |
|---|---|
| 11 | 11 |
| 16 | 13 |
| 17 | 5 |
| 19 | 21 |
| 19 | 24 |
| 20 | 8 |
| 22 | 16 |
| 29 | 8 |
| 32 | 22 |
| 34 | 24 |
| 54 | 9 |
| 55 | 13 |
| 56 | 17 |
| 56 | 18 |
| 56 | 23 |
| 57 | 17 |

పస్పశము 56 వ పుటలో "A సత్యనారాయ
బదులు "K. సత్యనారాయణ" యని యుండవలయు



# శుద్ధపత్రిక.

| పంక్తి. | ఒప్పు. |
| --- | --- |
| 11 | దేశికుల |
| 13 | పదపడి |
| 5 | తత్త్వ |
| 21 | మమునక |
| 24 | లెఱుంగక |
| 8 | గ్రామమందు |
| 16 | గదవే |
| 8 | శాస్త్రి |
| 22 | పదాఱులు |
| 24 | బండ్లాగు |
| 9 | జోక్యమిం |
| 13 | యని |
| 17 | మాకిcకక |
| 18 | వారె |
| 23 | పయి |
| 17 | లేcత |

పుటలో "A సత్యనారాయణ" యనుటకు
యణ" యని యుండవలయును.

